NATIONAL INTEGRATION LANGUAGE SERIES

# 30 రోజులలో సంస్కృత భాష

తెలుగు మూలంగా

సంస్కృత భాషను నేర్చుకోవడానికి
సంస్కృత భాషను తెలుసుకోవడానికి
సంస్కృత భాషను అర్థం చేసుకోవడానికి
సంస్కృత భాషను చదవడానికి
సంస్కృత భాషను మాట్లాడడానికి
సంస్కృత భాషను వ్రాయడానికి
ఇంకా
సంస్కృత భాషలో వర్ధించడానికి
సులభమైన మార్గం

ఇదిగో ఈ పుస్తకములో వున్నది



# 30 రోజులలో
# సంస్కృత భాష

*


రచయిత:

విద్యావిశారద

కిళాత్తూరు శ్రీనివాసాచార్యులు, P.O.L.

శిరోమణి, హిందీ విశారద్

(పరీక్షామంత్రి, చిత్తూరు సంస్కృత భాషా ప్రచారిణీ సభ)


*





BALAJI PUBLICATIONS

103, PYCROFTS ROAD

MADRAS-600 014

Third Edition 1980

Price Rs: 6-50



PHOTO OFFSET PRINTED BY:
NAVBHARAT PRINTERS & TRADERS
231 ROYAPETTAH HIGH ROAD MADRAS-600014 TELE 847091

# ఆశీస్సు

శ్రీ కాంచీ కామకోటి పీఠాధిపతి

జగద్గురు శ్రీ శంకరాచార్య స్వాములవారి శ్రీ మఠం,

కాంచీపురం.

మకాం:- కాంచీపురం SEAL తేది 22-7-72



మన భారతీయ సంస్కృతి సంప్రదాయములకు పునాదియైనదియు, శ్రీ రామాయణము, మహాభారతము, అష్టాదశ పురాణములు, కాళిదాసు వంటి మహా కవుల నాటకములు కావ్యములు మొదలైన గ్రంథములు కలిగినదియునైన సంస్కృత భాషను ఆంధ్రభాష మూలముగా సులభరీతిలో నేర్చుకొన గోరుచున్నవారికి అనుకూలముగా, చిత్తూరు సంస్కృత భాషా



ప్రచారిణీ సభ పరీక్ష మంత్రియగు కిళాత్తూరు శ్రీ కే. శ్రీనివాసాచార్యుల వారిచే వ్రాయబడి, మదరాసు బాలాజీ ప్రకాశకులవలన ప్రచురింపబడియున్న '30 రోజులలో సంస్కృత భాష' అనే పుస్తకము నాల్గు విభాగములలో— అక్షరములు, దైనందిన వ్యవహారములోని పదార్థములు, క్రియాకలాపములు వీటిని గుర్తించే పదములు, కథలు, వ్యాసములు, సంభాషణలు, నీతి శ్లోకములు, అనువాదములకైన శబ్దములు, శబ్దానుక్రమణిక మొదలగు విభాగములలో—సులభ పద్ధతిలో తెలుగు మూలంగా సంస్కృత భాషను నేర్చుకొనుటకు సహాయకంగా ఉంటున్నది.

ఆంధ్రము నేర్చిన ఆస్తికులు ఈ గ్రంథము ద్వారా సంస్కృత భాషను నేర్చుకొని ఈ భాషలోని కావ్యాదులను పఠించి ఫలితమునొందుదురు గాక !

శ్రీ జానకిరాముని బాలాజీ ప్రచురణాలయమున్ను ఇతోధికముగా గొప్ప గ్రంథములను ప్రచురించుచు అభివృద్ధినొందుగాక !

# FOREWORD

M. Ananthasayanam Ayyangar
Chairman,
Samskrita vidya peeth, Tirupati
(Ex. Governor of Bihar)

Tirupati
1.9.72

I have great pleasure in commending this book for the use of all who wish to learn Sanskrit in a short time. I also wish that every one in our country makes use of this book and learns Sanskrit as quickly as possible.

It may take some more time for a foreigner who does not know Sanskrit at all to learn Sanskrit than for an Indian whose mother tongue itself contains a large number of Sanskrit words and expressions.

Sanskrit embodies our culture, our religion and our philosophy. All our secular sastras also are Written in Sanskrit. No body can get to know India unless he has a working knowledge of S a n s k r i t. Sri K. Srinivasachariar, the author, is a scholar in Sanskrit and in Hindi as well. He has bestowed great thought and attention in the production of the book.

In short Sanskrit has been made as simple and easy as possible to learn.

(Sd.) M. ANANTHASAYANAM AYYANGAR

# విషయసూచిక

## నాల్గవ భాగము [అభ్యాసములు]



# ప్రకాశకుల విజ్ఞప్తి

జాతీయ భాషలుగా భారత ప్రభుత్వ శాసనము నిర్ణయించిన పదునైదు భాషలలో సంస్కృతము కూడా ఒకటి అనే విషయము సర్వవిదితము. ఆసేతు హిమాచలము నివసించుచున్న భారతీయుల సంస్కృతి సంప్రదాయ చిహ్నంగా ఉండబట్టియే సంస్కృత భాష జాతీయ భాషగా పరిగణించబడినది.

ఈ ప్రకాశక స్థాపనముద్వారా చాలా కాలముగా, భాషామూలక జాతీయ సమైక్యత కోసము National integration language series అనే పేరుతో జాతీయ భాషలు పదునైదులో ఒక్కొక్కదానినీ తదితర భాషల ద్వారా నేర్పించే పుస్తకాలను ప్రచురించవలెనని సంకల్పించుకొని. ఇప్పటికే అనేక భాషా గ్రంథాలను వెలువరచియున్నాము. ఆ వరుసలోని అనేక భాషా గ్రంథాలను రచించి మాకిచ్చిన బహుభాషా కోవిదులు విద్యావిశారద. శ్రీ కిళాత్తూరు శ్రీనివాసాచార్యులు P. O. L. శిరోమణి, హిందీ విశారద్‌గారే. తెలుగు మూలంగా సంస్కృతమును నేర్పించే ఈ పుస్తకమును కూడా రచించారు.

ఈ పుస్తకానికి శ్రీమత్పరమహంసేత్యాది శ్రీ కాంచీ కామకోటి పీఠాధిపతులు శ్రీశ్రీశ్రీ శంకరాచార్య స్వాములవారు అనుగ్రహించిన ఆశీస్సును రక్షగా భావించుచున్నాము. విఖ్యాత ఆంధ్ర మహా నాయకులు. తిరుపతిలోని కేంద్రీయ సంస్కృతి విద్యా పీఠాధ్యక్షులు అయిన శ్రీమాన్ మాడభూషి అనంతశయనం అయ్యంగారువారికి మా ధన్యవాదములర్పించుచున్నాము.

ఆంధ్రసోదరులు ఈ గ్రంథమును. మా ఇతర ప్రచురణలను స్వీకరించి మమ్ము ప్రోత్సహింపజేయ గోరుచున్నాము.

—బాలాజీ పబ్లికేషన్స్

# మున్నుడి

'సంస్కృతం' అనే పదము, 'బాగుచేయబడినది', 'నవరించి పెట్టబడినది', చక్కవిదిగా చేయబడినది' అనే అర్థములనిచ్చును.

వేదకాలమున ఈ భాషకు 'దైవీవాక్' (దేవభాష) అను పేరు ఉండెడిది. కాని ఆ కాలములో అవ్యవస్థముగా యుండిన ఈ భాషను క్రీ. పె. 7వ శతాబ్దిలోనుండిన 'పాణిని' అనే వ్యాకరణ శాస్త్ర నిర్మాత సంస్కరించి, నియమబద్ధమొనరించినపిదప, ఈ భాష 'సంస్కృతము' అనే పేరుతో పిలువబడుచున్నది.

శ్రీమద్వాల్మీకి రామాయణము, మహాభారతము, అష్టాదశ పురాణములు, పదునెనిమిది స్మృతులు, షడ్ దర్శనములు అనే ఆరు విధములైన శాస్త్రములు, కాళిదాసుడు, మాఘుడు, భారవి, భాసుడు, భవభూతివంటి మహాకవులు రచించిన వందలకొలది కావ్యములు, నాటకములు, ఖగోళ శాస్త్రము, జ్యోతిషము, వైద్యము, వాస్తుకళ మొదలగు వాటిని గురించిన గ్రంథములు ఇవన్నియు తొలిసారిగా ఈ సంస్కృత భాష యందే రచించబడినవి.

ఈ నాగరిక యుగంలో కూడా సంస్కృత భాషను అభ్యసించవలెననే కుతూహలము యావత్ప్రపంచములోని విద్యావేత్తలకు కలిగియుండుట అసహజము కాదు. అందుచేత, తమ తమ మాతృభాషకు చెందిన లిపితోనే, స్వయముగా, ఇతరుల సహాయము లేకుండానే నేర్చుకొనుటకు అనువుగా నాగరలిపిలోని ఆయా శబ్దముల క్రింద వాటియుచ్చారణ, అర్థము ఇవ్వబడియున్నవి.

ఈ పుస్తకములో నాల్గు విభాగములున్నవి :-

మొదటి భాగములో (పేజీ 12-30) దేవనాగరి అక్షరములన్నియు— అచ్చులు, హల్లులు, సంధ్యక్షరములు మొదలైనవన్నియు పూర్తిగా వివరించబడియున్నవి. ప్రతి అక్షరమునకు క్రింద దానియుచ్చారణ ఉన్నది. గాక, అక్షరములను వ్రాయు పద్ధతి మొదట రెండు పేజీలలో తెలుపబడియున్నది. ఆయా అక్షరములోని బాణచిహ్నమున్న దారిన అక్షరములను వ్రాసి అభ్యసింపవలెను.



రెండవ భాగములో (పేజీ 31-118) అన్ని విధములైన నామవాచకములు, సర్వనామ శబ్దములు యివ్వబడి యున్నవి. వాటిని విభక్తులతో వ్రాయు పద్ధతి కూడా ఉదాహరణ శబ్దముతో వివరించబడి యున్నది. ఆయా ఉదాహరణలను బట్టి ఈ శబ్దములను పూర్తిగా వ్రాసి అభ్యసించవలెను. ఈ భాగములో దైనందిన వ్యవహారములోని పెక్కు విధములైన శబ్దములు ఇవ్వబడియున్నవి.

మూడవ భాగములో (పేజీ 119-172) సంస్కృత ధాతువులు, ఆ ధాతువులవలన ఏర్పడే శబ్దములు, అవ్యయములు మొదలైనవన్నియు ఉదాహరణ వాక్యములతో సహా ఇవ్వబడియున్నవి.

నాల్గవ భాగములో (పేజీ 173-207) పలువిధములైన వ్యాసములు, కథలు, సంభాషణలు, కొన్ని నీతి శ్లోకములు, ఉపదేశ వాక్యములు కూడా యున్నవి. పుస్తకము చివర యున్న అకారానుక్రమణిక తెలుగు నుండి సంస్కృతమునకు అనువాదము చేయునప్పుడు బాగుగా ఉపయోగించును.

పై విధముగా సులభరీతిలో సంస్కృత భాషను నేర్పించగల ఈ పుస్తకమును భాషాభిమానముగల ఆంధ్రసోదరులు ఆదరించి, ఉపయోగించి మమ్ము ప్రోత్సహింపజేయవలెనని వేడుకొనుచున్నాను.

—రచయిత

అచ్చులు వ్రాయు పద్ధతి బాణచిహ్నములతోను సంఖ్యలతోను చూపబడినది

अ आ इ

ई उ ऊ

ऋ ॠ ऌ

ए ऐ ओ

औ अं अः

హల్లులు వ్రాయు పద్ధతి

क ख ग घ ङ

च छ ज झ ञ

ट ठ ड ढ ण

त थ द ध न

प फ ब भ म

य र ल व श

ष स ह ळ क्ष

# అక్షరముల ఉచ్చారణ

1. తెలుగులోని ఎ, ఒ—అనే హ్రస్వాక్షరములు సంస్కృతములో లేవు. అందుచేత, ए, ओ అనే అక్షరములను 'ఏ, ఓ' అని దీర్ఘముగానే పలుకవలెను.

2. अं అనే అక్షరముల పైయున్న సున్నకు అనుస్వారము అని పేరు. అది 'మ్' అక్షరమువలె పలుకును.

3. अः అను చోట ఉన్న రెండు చుక్కలు 'అహ' అని పలుకును. దీనికి విసర్గము అని పేరు. ఈ విసర్గము తనకు ముందున్న అచ్చు అక్షరమునకున్న ఉచ్చారణను కలిగియుండును. అనగా: రామహ, హరిహి, గురుహు అనే రీతిన విసర్గము పలుకును.

4. తెలుగులో ఉన్న శకట రేఫము సంస్కృతములో లేదు. ఇతర అక్షరముల విషయములో సంస్కృత అక్షరమాలకును తెలుగు అక్షరమాలకును వ్యత్యాసము లేదు.

మొదటి భాగము (అక్షరమాల)

## అచ్చులు

## स्वराः (अचः)

| | |
|---|---|
| अ | అ |
| आ | ఆ |
| इ | ఇ |
| ई | ఈ |
| उ | ఉ |
| ऊ | ఊ |
| ऋ | ఋ |
| ॠ | ౠ |
| ऌ | ఌ |
| ए | ఏ |
| ऐ | ఐ |
| ओ | ఓ |
| औ | ఔ |
| अं | అం |
| अः | అహ |

# హల్లులు

## व्यंजनानि (हलः)

| | | | | | |
|---|---|---|---|---|---|
| 1. | क | ख | ग | घ | ङ |
| | క | ఖ | గ | ఘ | ఙ |
| | च | छ | ज | झ | ञ |
| | చ | ఛ | జ | ఝ | ఞ |
| | ट | ठ | ड | ढ | ण |
| | ట | ఠ | డ | ఢ | ణ |
| | त | थ | द | ध | न |
| | త | థ | ద | ధ | న |
| | प | फ | ब | भ | म |
| | ప | ఫ | బ | భ | మ |
| | य | र | ल | व | श |
| | య | ర | ల | వ | శ |
| | ष | स | ह | ळ | क्ष |
| | ష | స | హ | ళ | క్ష |

సూచన :—పై హల్లులతో అచ్చులన్నియు కలియునప్పుడు ఏర్పడు గుణింతములన్నింటిని పేజీ 19నుండి 26 వరకు చూడవలెను.



## గుర్తు పెట్టుడు

[ఇంచుమించు ఒకే రకంగా కనిపించే క్రింది వరుసలలోని అక్షరాలను గుర్తుపెట్టి, వాటి మధ్య ఉన్న కొద్దిపాటి మార్పును గుర్తించి, పొరపాటు లేకుండా వ్రాయడానికి నేర్చుకోవాలి.]

अ आ उ ऊ ओ औ अं

ज ञ

ट ड ठ ढ द

ड ङ इ ई ह झ

प ष ण

व ब च

फ क ऋ

य थ

ग म भ न

घ ध छ

त ल

र स ख श ए ऐ

# స్వర చిహ్నములు

[హల్లులతో అచ్చులను కలుపు నప్పుడు వచ్చుచున్న. అచ్చుల దీర్ఘ హ్రస్వాది చిహ్నములు క్రింద సూచింపబడినవి.]

| అచ్చు | చిహ్నము | ఉదాహరణము | అచ్చు | చిహ్నము | ఉదాహరణము |
|---|---|---|---|---|---|
| अ<br>అ | ... | ... | ॠ<br>ౠ | ॄ | पितॄणां<br>పితౄణాం |
| आ<br>ఆ | ा | रामः<br>రామః | ऌ<br>ఌ | ॢ | क्लृप्तम्<br>క్లృప్తమ్ |
| इ<br>ఇ | ि | शिवः<br>శివః | ए<br>ఏ | े | केशः<br>కేశః |
| ई<br>ఈ | ी | गीतं<br>గీతం | ऐ<br>ఐ | ै | दैवम्<br>దైవం |
| उ<br>ఉ | ु | बुधः<br>బుధః | ओ<br>ఓ | ो | लोकः<br>లోకః |
| ऊ<br>ఊ | ू | दूतः<br>దూతః | अं<br>అం | ं | कंसः<br>కంసః |
| ऋ<br>ఋ | ृ | नृत्तं<br>నృత్తం | अः<br>అః | ः | नरः<br>నరః |

| | | | | |
|---|---|---|---|---|
| क<br>క | ख<br>ఖ | ग<br>గ | घ<br>ఘ | ङ<br>ఙ |
| का<br>కా | खा<br>ఖా | गा<br>గా | घा<br>ఘా | ङा<br>ఙా |
| कि<br>కి | खि<br>ఖి | गि<br>గి | घि<br>ఘి | ङि<br>ఙి |
| की<br>కీ | खी<br>ఖీ | गी<br>గీ | घी<br>ఘీ | ङी<br>ఙీ |
| कु<br>కు | खु<br>ఖు | गु<br>గు | घु<br>ఘు | ङु<br>ఙు |
| कू<br>కూ | खू<br>ఖూ | गू<br>గూ | घू<br>ఘూ | ङू<br>ఙూ |
| कृ<br>కృ | खृ<br>ఖృ | गृ<br>గృ | घृ<br>ఘృ | ङृ<br>ఙృ |
| के<br>కే | खे<br>ఖే | गे<br>గే | घे<br>ఘే | ङे<br>ఙే |
| कै<br>కై | खै<br>ఖై | गै<br>గై | घै<br>ఘై | ङै<br>ఙై |
| को<br>కో | खो<br>ఖో | गो<br>గో | घो<br>ఘో | ङो<br>ఙో |
| कौ<br>కౌ | खौ<br>ఖౌ | गौ<br>గౌ | घौ<br>ఘౌ | ङौ<br>ఙౌ |
| कं<br>కం | खं<br>ఖం | गं<br>గం | घं<br>ఘం | ङं<br>ఙం |
| कः<br>కః | खः<br>ఖః | गः<br>గః | घः<br>ఘః | ङः<br>ఙః |

| | | | | |
|---|---|---|---|---|
| च | छ | ज | झ | ञ |
| చ | ఛ | జ | ఝ | ఞ |
| चा | छा | जा | झा | ञा |
| చా | ఛా | జా | ఝా | ఞా |
| चि | छि | जि | झि | ञि |
| చి | ఛి | జి | ఝి | ఞి |
| ची | छी | जी | झी | ञी |
| చీ | ఛీ | జీ | ఝీ | ఞీ |
| चु | छु | जु | झु | ञु |
| చు | ఛు | జు | ఝు | ఞు |
| चू | छू | जू | झू | ञू |
| చూ | ఛూ | జూ | ఝూ | ఞూ |
| चृ | छृ | जृ | झृ | ञृ |
| చృ | ఛృ | జృ | ఝృ | ఞృ |
| चे | छे | जे | झे | ञे |
| చె | ఛె | జె | ఝె | ఞె |
| चै | छै | जै | झै | ञै |
| చై | ఛై | జై | ఝై | ఞై |
| चो | छो | जो | झो | ञो |
| చొ | ఛొ | జొ | ఝొ | ఞొ |
| चौ | छौ | जौ | झौ | ञौ |
| చౌ | ఛౌ | జౌ | ఝౌ | ఞౌ |
| चं | छं | जं | झं | ञं |
| చం | ఛం | జం | ఝం | ఞం |
| चः | छः | जः | झः | ञः |
| చః | ఛః | జః | ఝః | ఞః |

| | | | | |
|---|---|---|---|---|
| ट | ठ | ड | ढ | ण |
| ట | ఠ | డ | ఢ | ణ |
| टा | ठा | डा | ढा | णा |
| టా | ఠా | డా | ఢా | ణా |
| टि | ठि | डि | ढि | णि |
| టి | ఠి | డి | ఢి | ణి |
| टी | ठी | डी | ढी | णी |
| టీ | ఠీ | డీ | ఢీ | ణీ |
| टु | ठु | डु | ढु | णु |
| టు | ఠు | డు | ఢు | ణు |
| टू | ठू | डू | ढू | णू |
| టూ | ఠూ | డూ | ఢూ | ణూ |
| टृ | ठृ | डृ | ढृ | णृ |
| టృ | ఠృ | డృ | ఢృ | ణృ |
| टे | ठे | डे | ढे | णे |
| టె | ఠె | డె | ఢె | ణె |
| टै | ठै | डै | ढै | णै |
| టై | ఠై | డై | ఢై | ణై |
| टो | ठो | डो | ढो | णो |
| టొ | ఠొ | డొ | ఢొ | ణొ |
| टौ | ठौ | डौ | ढौ | णौ |
| టౌ | ఠౌ | డౌ | ఢౌ | ణౌ |
| टं | ठं | डं | ढं | णं |
| టం | ఠం | డం | ఢం | ణం |
| टः | ठः | डः | ढः | णः |
| టః | ఠః | డః | ఢః | ణః |

| | | | | |
|---|---|---|---|---|
| त | थ | द | ध | न |
| త | థ | ద | ధ | న |
| ता | था | दा | धा | ना |
| తా | థా | దా | ధా | నా |
| ति | थि | दि | धि | नि |
| తి | థి | ది | ధి | ని |
| ती | थी | दी | धी | नी |
| తీ | థీ | దీ | ధీ | నీ |
| तु | थु | दु | धु | नु |
| తు | థు | దు | ధు | ను |
| तू | थू | दू | धू | नू |
| తూ | థూ | దూ | ధూ | నూ |
| तृ | थृ | दृ | धृ | नृ |
| తృ | థృ | దృ | ధృ | నృ |
| ते | थे | दे | धे | ने |
| తే | థే | దే | ధే | నే |
| तै | थै | दै | धै | नै |
| తై | థై | దై | ధై | నై |
| तो | थो | दो | धो | नो |
| తో | థో | దో | ధో | నో |
| तौ | थौ | दौ | धौ | नौ |
| తౌ | థౌ | దౌ | ధౌ | నౌ |
| तं | थं | दं | धं | नं |
| తం | థం | దం | ధం | నం |
| तः | थः | दः | धः | नः |
| తః | థః | దః | ధః | నః |

| | | | | |
|---|---|---|---|---|
| प | फ | ब | भ | म |
| ప | ఫ | బ | భ | మ |
| पा | फा | बा | भा | मा |
| పా | ఫా | బా | భా | మా |
| पि | फि | बि | भि | मि |
| పి | ఫి | బి | భి | మి |
| पी | फी | बी | भी | मी |
| పీ | ఫీ | బీ | భీ | మీ |
| पु | फु | बु | भु | मु |
| పు | ఫు | బు | భు | ము |
| पू | फू | बू | भू | मू |
| పూ | ఫూ | బూ | భూ | మూ |
| पृ | फृ | बृ | भृ | मृ |
| పృ | ఫృ | బృ | భృ | మృ |
| पे | फे | बे | भे | मे |
| పే | ఫే | బే | భే | మే |
| पै | फै | बै | भै | मै |
| పై | ఫై | బై | భై | మై |
| पो | फो | बो | भो | मो |
| పో | ఫో | బో | భో | మో |
| पौ | फौ | बौ | भौ | मौ |
| పౌ | ఫౌ | బౌ | భౌ | మౌ |
| पं | फं | बं | भं | मं |
| పం | ఫం | బం | భం | మం |
| पः | फः | बः | भः | मः |
| పః | ఫః | బః | భః | మః |

| | | | | |
|---|---|---|---|---|
| य | र | ल | व | श |
| య | ర | ల | వ | శ |
| या | रा | ला | वा | शा |
| యా | రా | లా | వా | శా |
| यि | रि | लि | वि | शि |
| యి | రి | లి | వి | శి |
| यी | री | ली | वी | शी |
| యీ | రీ | లీ | వీ | శీ |
| यु | रु | लु | वु | शु |
| యు | రు | లు | వు | శు |
| यू | रू | लू | वू | शू |
| యూ | రూ | లూ | వూ | శూ |
| यृ | ... | लृ | वृ | शृ |
| యృ | | లృ | వృ | శృ |
| ये | रे | ले | वे | शे |
| యే | రే | లే | వే | శే |
| यै | रै | लै | वै | शै |
| యై | రై | లై | వై | శై |
| यो | रो | लो | वो | शो |
| యో | రో | లో | వో | శో |
| यौ | रौ | लौ | वौ | शौ |
| యౌ | రౌ | లౌ | వౌ | శౌ |
| यं | रं | लं | वं | शं |
| యం | రం | లం | వం | శం |
| यः | रः | लः | वः | शः |
| యః | రః | లః | వః | శః |

| | | | | |
|---|---|---|---|---|
| ष | स | ह | ळ | क्ष |
| ష | స | హ | ళ | క్ష |
| षा | सा | हा | ळा | क्षा |
| షా | సా | హా | ళా | క్షా |
| षि | सि | हि | ळि | क्षि |
| షి | సి | హి | ళి | క్షి |
| षी | सी | ही | ळी | क्षी |
| షీ | సీ | హీ | ళీ | క్షీ |
| षु | सु | हु | ळु | क्षु |
| షు | సు | హు | ళు | క్షు |
| षू | सू | हू | ळू | क्षू |
| షూ | సూ | హూ | ళూ | క్షూ |
| षृ | सृ | हृ | ळृ | क्षृ |
| షృ | సృ | హృ | ళృ | క్షృ |
| षे | से | हे | ळे | क्षे |
| షే | సే | హే | ళే | క్షే |
| षै | सै | है | ळै | क्षै |
| షై | సై | హై | ళై | క్షై |
| षो | सो | हो | ळो | क्षो |
| షో | సో | హో | ళో | క్షో |
| षौ | सौ | हौ | ळौ | क्षौ |
| షౌ | సౌ | హౌ | ళౌ | క్షౌ |
| षं | सं | हं | ळं | क्षं |
| షం | సం | హం | ళం | క్షం |
| षः | सः | हः | ळः | क्षः |
| షః | సః | హః | ళః | క్షః |

# సంయుక్తాక్షరములు

| | | | | | | |
|---|---|---|---|---|---|---|
| क् | + | क | = | क्क | अक्का | |
| క్ | | క | | క్క | అక్కా | తల్లి |
| क् | + | त | = | क्त | भक्तः | |
| క్ | | త | | క్త | భక్తః | భక్తుడు |
| क् | + | म | = | क्म | रुक्मम् | |
| క్ | | మ | | క్మ | రుక్మం | బంగారు |
| क् | + | य | = | क्य | वाक्यम् | |
| క్ | | య | | క్య | వాక్యం | వాక్యము |
| क् | + | र | = | क्र | वक्रम् | |
| క్ | | ర | | క్ర | వక్రం | వంకర |
| क् | + | ल | = | क्ल | शुक्ल | |
| క్ | | ల | | క్ల | శుక్లం | తెల్లది |
| क् | + | व | = | क्व | पक्वम् | |
| క్ | | వ | | క్వ | పక్వం | పండినది |
| क् | + | ष | = | क्ष | पक्षः | |
| క్ | | ష | | క్ష | పక్షః | రెక్క |
| क्ष् | + | ण | = | क्ष्ण | तीक्ष्णः | |
| క్ష్ | | ణ | | క్ష్ణ | తీక్ష్ణః | వాడియైనది |



| | | | | | | |
|---|---|---|---|---|---|---|
| क्ष् | + | म | = | क्ष्म | सूक्ष्मम् | |
| క్ష్ | | మ | | క్ష్మ | సూక్ష్మం | సూక్ష్మము |
| क्ष् | + | य | = | क्ष्य | लक्ष्यम् | |
| క్ష్ | | య | | క్ష్య | లక్ష్యం | గురి |
| ग् | + | ध | = | ग्ध | मुग्धः | |
| గ్ | | ధ | | గ్ధ | ముగ్ధః | మూఢుడు |
| ग् | + | न | = | ग्न | मग्नम् | |
| గ్ | | న | | గ్న | మగ్నం | మునిగినది |
| ग् | + | म | = | ग्म | युग्मं | |
| గ్ | | మ | | గ్మ | యుగ్మం | జంట |
| ग् | + | य | = | ग्य | योग्यम् | |
| గ్ | | య | | గ్య | యోగ్యం | తగినది |
| ग् | + | र | = | ग्र | अग्रम् | |
| గ్ | | ర | | గ్ర | అగ్రం | మొదటిది |
| घ् | + | न | = | घ्न | विघ्नः | |
| ఘ్ | | న | | ఘ్న | విఘ్నః | అడ్డము |
| घ् | + | र | = | घ्र | शीघ्रम् | |
| ఘ్ | | ర | | ఘ్ర | శీఘ్రం | త్వరగా |
| ङ् | + | क | = | ङ्क | अङ्कः | |
| ఙ్ | | క | | ఙ్క | అఙ్కః | సంఖ్య |

| | | | | | | |
|---|---|---|---|---|---|---|
| च् + | च | = च्च | | उच्चः | | |
| చ్ | చ | చ్చ | | ఉచ్చః | ఉన్నతము | |
| च् + | छ | = च्छ | | गुच्छः | | |
| చ్ | ఛ | చ్ఛ | | గుచ్ఛః | గుత్తు | |
| च् + | य | = च्य | | वाच्यम् | | |
| చ్ | య | చ్య | | వాచ్యం | అర్థము | |
| ज् + | ञ | = ज्ञ | | आज्ञा | | |
| జ్ | ఞ | జ్ఞ | | ఆజ్ఞ | ఆజ్ఞ | |
| ज् + | य | = ज्य | | राज्यम् | | |
| జ్ | య | జ్య | | రాజ్యం | రాజ్యము | |
| ट् + | य | = ट्य | | नाट्यं | | |
| ట్ | య | ట్య | | నాట్యం | నాట్యము | |
| ठ् + | य | = ठ्य | | पाठ्यम् | | |
| ఠ్ | య | ఠ్య | | పాఠ్యం | పాఠము | |
| त् + | त | = त्त | | चित्तम् | | |
| త్ | త | త్త | | చిత్తం | మనస్సు | |
| त् + | न | = त्न | | रत्नम् | | |
| త్ | న | త్న | | రత్నం | రత్నము | |
| त् + | म | + त्म | | आत्मा | | |
| త్ | మ | త్మ | | ఆత్మ | ఆత్మ | |



| | | | | | | |
|---|---|---|---|---|---|---|
| त् + | य | | = त्य | सत्यं | | |
| త్ | య | | త్య | సత్యం | సత్యము | |
| त् + | र | | = त्र | नेत्रं | | |
| త్ | ర | | త్ర | నేత్రం | కన్ను | |
| त् + | व | | = त्व | त्वरितम् | | |
| త్ | వ | | త్వ | త్వరితం | త్వరగా | |
| द् + | ग | | = द्ग | मुद्गः | | |
| ద్ | గ | | ద్గ | ముద్గః | పెసరు | |
| द् + | ध | | = द्ध | बुद्धः | | |
| ద్ | ధ | | ద్ధ | బుద్ధః | బుద్ధుడు | |
| द् + | म | | = द्म | सद्म | | |
| ద్ | మ | | ద్మ | సద్మ | ఇల్లు | |
| द् + | य | | = द्य | पद्यम् | | |
| ద్ | య | | ద్య | పద్యం | పద్యము | |
| द् + | र | | = द्र | समुद्रः | | |
| ద్ | ర | | ద్ర | సముద్రః | సముద్రము | |
| द् + | र् + | य | = द्र्य | दारिद्र्यम् | | |
| ద్ | ర్ | య | ద్ర్య | దారిద్ర్యం | పేదరికము | |
| द् + | व | | = द्व | विद्वान् | | |
| ద్ | వ | | ద్వ | విద్వాన్ | విద్వాంసుడు | |

| | | | | | |
|---|---|---|---|---|---|
| ध् + य = ध्य | | | मध्यः | | |
| ధ్ | య | ధ్య | మధ్యః | మధ్య భాగము |
| न् + त = न्त | | | सन्तः | |
| | త | న్త | సన్తః | మంచివారు |
| प् + र = प्र | | | प्रतिमा | |
| ప్ | ర | ప్ర | ప్రతిమా | బొమ్మ |
| ब् + द = ब्द | | | अब्दः | |
| బ్ | ద | బ్ద | అబ్దః | సంవత్సరము |
| ब् + र = ब्र | | | ब्रह्मा | |
| బ్ | ర | బ్ర | బ్రహ్మా | బ్రహ్మ |
| म् + ब = म्ब | | | अम्बा | |
| మ్ | బ | మ్బ | అమ్బా | తల్లి |
| म् + भ = म्भ | | | स्तम्भः | |
| మ్ | భ | మ్భ | స్తమ్భః | స్తంభము |
| म् + र = म्र | | | ताम्रम् | |
| మ్ | ర | మ్ర | తామ్రం | రాగి |
| र् + म = र्म | | | कर्म | |
| ర్ | మ | ర్మ | కర్మ | పని, కర్తవ్యము |
| श् + र = श्र | | | मिश्रः | |
| శ్ | ర | శ్ర | మిశ్రః | కలిపినది |

# రెండవ భాగము

## (పదములు)

సంస్కృత పదాలు ఒక్కొక్కటీ తనకై యున్న లింగము, వచనము, విభక్తి వీటిని కలిగియుంటుంది.

లింగము : సంస్కృత నామ వాచక పదాల లింగాలను వ్యాకరణము మూలంగాను, కవి ప్రయోగాదుల మూలంగాను తెలుసుకోవాలి. కాని ఆ వస్తువుకున్న లింగ చిహ్నాన్నిబట్టి కాదు. సంస్కృతంలో పుంలింగము, స్త్రీ లింగము, నపుంసక లింగము అని మూడు లింగములున్నవి.

వచనము : తతిమ్మా భాషలలాగా కాకుండా సంస్కృత శబ్దాలకు ద్వివచనం కూడా ఉంటుంది. ఏకవచనం ఒక వ్యక్తి, లేదా ఒక వస్తువును గుర్తించును. ద్వివచనం రెంటిని చెప్పును. బహువచనం రెంటికంటె ఎక్కువ వాటికై ప్రయోగించబడుతుంది.

విభక్తి : ప్రథమా, ద్వితీయా, తృతీయా, చతుర్థీ, పంచమీ, షష్ఠీ, సప్తమీ, సంబోధన అని విభక్తులు ఎనిమిది. సంబోధనము ప్రథమా విభక్తిలోనే చేరును.

## ముఖ్య గమనిక

సంస్కృతం చదువగోరుతున్న విద్యార్థులు, ప్రతి నామ వాచకానికి, సర్వనామ శబ్దానికీ ఉన్న అన్ని విభక్తులను చక్కగా నేర్చుకోవాలి అలాగే క్రియా పదాలకున్న ప్రకృతి ప్రత్యయాలను చక్కగా తెలుసుకోవాలి. ముందు పేజీలలో ఎడమ వైపున శబ్దాలకు, కుడివైపు పేజీలోని శబ్దానికి ఇచ్చిన విభక్తులలాగా విభక్తులను వ్రాసి అభ్యసించాలి. ఇది చాలా అవసరం.

## అచ్చులలో ముగియు కొన్ని పదములు (పుంలింగము)

### అకారముతో ముగియు కొన్ని పదములు

| | | | | | |
|---|---|---|---|---|---|
| रा मः | | | बा लः | | |
| రా మః | రాముడు | | బా లః | బాలుడు | |
| कृ ष्णः | | | पु त्रः | | |
| కృ ష్ణః | కృష్ణుడు | | పు త్రః | పుత్రుడు | |
| वृ क्षः | | | सिं हः | | |
| వృ క్షః | చెట్టు | | సిం హః | సింహము | |
| ग जः | | | मे घः | | |
| గ జః | ఏనుగు | | మే ఘః | మేఘము | |
| स र्पः | | | बु धः | | |
| స ర్పః | పాము | | బు ధః | పండితుడు | |
| मृ गः | | | नृ पः | | |
| మృ గః | జింక | | నృ పః | రాజు | |
| घ टः | | | अ श्वः | | |
| ఘ టః | కుండ | | అ శ్వః | గుఱ్ఱము | |
| न रः | | | कू र्मः | | |
| న రః | మానవుడు | | కూ ర్మః | తాబేలు | |
| सू र्यः | | | क टः | | |
| సూ ర్యః | సూర్యుడు | | క టః | చాప | |
| च न्द्रः | | | क रः | | |
| చం ద్రః | చంద్రుడు | | క రః | చేయి | |

సూచన: పై శబ్దాలకు కుడి వైపు పేజీలోని 'రాము' శబ్దమునకు వలె విభక్తులను వ్రాయుము.



## अकारान्तः पुंलिंगो 'राम' शब्दः

### అకారాంతః పుంలింగో 'రామ' శబ్దః

| విభక్తి | ఏకవచనము | ద్వివచనము | బహువచనము | ఏకవచన-అర్థము |
|---|---|---|---|---|
| ప్రథమా | रामः<br>రామః | रामौ<br>రామౌ | रामाः<br>రామాః | రాముడు |
| ద్వితీయా | रामं<br>రామం | रामौ<br>రామౌ | रामान्<br>రామాన్ | రాముని |
| తృతీయా | रामेण<br>రామేణ | रामाभ्यां<br>రామాభ్యాం | रामैः<br>రామైః | రామునిచేత/తో |
| చతుర్థీ | रामाय<br>రామాయ | रामाभ्यां<br>రామాభ్యాం | रामेभ्यः<br>రామేభ్యః | రాముని కొఱకు/కై |
| పంచమీ | रामात्<br>రామాత్ | रामाभ्यां<br>రామాభ్యాం | रामेभ्यः<br>రామేభ్యః | రామునివలన/కంటె |
| షష్ఠీ | रामस्य<br>రామస్య | रामयोः<br>రామయోః | रामाणाम्<br>రామాణాం | రామునికి/యొక్క |
| సప్తమీ | रामे<br>రామే | रामयोः<br>రామయోః | रामेषु<br>రామేషు | రామునియందు |
| సంబోధన | हे राम<br>హే రామ | हे रामौ<br>హే రామౌ | हे रामाः<br>హే రామాః | ఓ రాముడా! |

సూచన:—ద్వివచన - బహువచనముల అర్థములను 'ఇద్దరు రాములు', 'బహు రాములు' అను రీతిన ఊహింపుడు.

## 'ఇ'కారముతో ముగియు కొన్ని పుంలింగ శబ్దములు

| | | | |
|---|---|---|---|
| हरिः<br>హరిః | విష్ణువు | मणिः<br>మణిః | రత్నము |
| कविः<br>కవిః | కవి | अग्निः<br>అగ్నిః | నిప్పు |
| रविः<br>రవిః | సూర్యుడు | अलिः<br>అలిః | తుమ్మెద |
| मुनिः<br>మునిః | మహర్షి | भूपतिः<br>భూపతిః | రాజు |
| गिरिः<br>గిరిః | పర్వతము | अतिथिः<br>అతిథిః | అతిథి |
| कलिः<br>కలిః | కలియుగము | किटिः<br>కిటిః | పంది |
| कपिः<br>కపిః | కోతి | पतत्रिः<br>పతత్రిః | పక్షి |
| यतिः<br>యతిః | సన్న్యాసి | पाणिः<br>పాణిః | చేయి |
| अरिः<br>అరిః | శత్రువు | बलिः<br>బలిః | పూజ |
| ज्ञातिः<br>జ్ఞాతిః | జ్ఞాతి | शनिः<br>శనిః | శనైశ్చరుడు |

సూచన :— పై శబ్దము లన్నింటికి కుడిప్రక్క పేజీలో ఉన్న 'హరి' శబ్దమునకువలె అన్ని విభక్తులను వ్రాయుడు.



# इकारान्तः पुंलिगो 'हरि' शब्दः

## ఇకారాంతః పుంలింగో 'హరి' శబ్దః

| విభక్తి | ఏ. వ. | ద్వి. వ. | బ. వ. | ఏ. వ. అర్థము |
|---|---|---|---|---|
| 1. | हरिः<br>హరిః | हरी<br>హరీ | हरयः<br>హరయః | విష్ణువు |
| 2. | हरिं<br>హరిం | हरी<br>హరీ | हरीन्<br>హరీన్ | విష్ణువును |
| 3. | हरिणा<br>హరిణా | हरिभ्यां<br>హరిభ్యాం | हरिभिः<br>హరిభిః | విష్ణువుచేత/తో |
| 4. | हरये<br>హరయే | हरिभ्यां<br>హరిభ్యాం | हरिभ्यः<br>హరిభ్యః | విష్ణువుకొఱకు |
| 5. | हरेः<br>హరేః | हरिभ्यां<br>హరిభ్యాం | हरिभ्यः<br>హరిభ్యః | విష్ణువు వలన |
| 6. | हरेः<br>హరేః | हर्योः<br>హర్యోః | हरीणां<br>హరీణాం | విష్ణువు యొక్క |
| 7. | हरौ<br>హరౌ | हर्योः<br>హర్యోః | हरिषु<br>హరిషు | విష్ణువునందు |
| 8. | हे हरे<br>హే హరే | हे हरी<br>హే హరీ | हे हरयः<br>హే హరయః | ఓ విష్ణువా! |

## 'ఉ'కారముతో ముగియు కొన్ని పుంలింగ శబ్దములు

| | | | | |
|---|---|---|---|---|
| गुरुः<br>గురుః | గురువు | | इषुः<br>ఇషుః | బాణము |
| शम्भुः<br>శంభుః | శివుడు | | इन्दुः<br>ఇందుః | చంద్రుడు |
| भानुः<br>భానుః | సూర్యుడు | | पांसुः<br>పాంసుః | దుమ్ము |
| विष्णुः<br>విష్ణుః | విష్ణువు | | वायुः<br>వాయుః | గాలి |
| बन्धुः<br>బంధుః | బంధువు | | बिन्दुः<br>బిందుః | చుక్క |
| तरुः<br>తరుః | చెట్టు | | क्रतुः<br>క్రతుః | యజ్ఞము |
| साधुः<br>సాధుః | సాధువు | | अणुः<br>అణుః | అణువు |
| इक्षुः<br>ఇక్షుః | చెఱుకు | | बाहुः<br>బాహుః | చేయి |
| सूनुः<br>సూనుః | పుత్రుడు | | सेतुः<br>సేతుః | వంతెన |
| जन्तुः<br>జంతుః | జంతువు | | | |

సూచన :— కుడివైపు పేజీలో ఉన్న 'గురు' శబ్దమునకువలె పై శబ్దాలన్నింటికి విభక్తులను వ్రాయవలెను.



## उकारान्तः पुंलिगो 'गुरु' शब्दः

ఉకారాంతః పుంలింగో 'గురు' శబ్దః

| విభక్తి | ఏ. వ. | ద్వి. వ. | బ. వ. | ఏ. వ. అర్థము |
|---|---|---|---|---|
| 1. | गुरुः<br>గురుః | गुरू<br>గురూ | गुरवः<br>గురవః | గురువు |
| 2. | गुरुं<br>గురుం | गुरू<br>గురూ | गुरून्<br>గురూన్ | గురువును |
| 3. | गुरुणा<br>గురుణా | गुरुभ्यां<br>గురుభ్యాం | गुरुभिः<br>గురుభిః | గురువుతో/<br>చేత |
| 4. | गुरवे<br>గురవే | गुरुभ्यां<br>గురుభ్యాం | गुरुभ्यः<br>గురుభ్యః | గురువువలన |
| 5. | गुरोः<br>గురోః | गुरुभ्यां<br>గురుభ్యాం | गुरुभ्यः<br>గురుభ్యః | గురువుకొఱకు |
| 6. | गुरोः<br>గురోః | गुर्वोः<br>గుర్వోః | गुरूणाम्<br>గురూణాం | గురువుయొక్క |
| 7. | गुरौ<br>గురౌ | गुर्वोः<br>గుర్వోః | गुरुषु<br>గురుషు | గురువునందు |
| 8. | हे गुरो<br>హే గురో | हे गुरू<br>హే గురూ | हे गुरवः<br>హే గురవః | ఓ గురువా! |

# ऋकारान्तः पुंलिगो 'धातृ' शब्दः

## ఋకారాంతః పుంలింగో 'ధాతృ' శబ్దః

| విభక్తి | ఏ. వ. | ద్వి. వ | బ. వ. | ఏ.వ. అర్థము |
|---|---|---|---|---|
| 1. | धाता<br>ధాతా | धातारौ<br>ధాతారౌ | धातारः<br>ధాతారః | బ్రహ్మ |
| 2. | धातारं<br>ధాతారం | धातारौ<br>ధాతారౌ | धातॄन्<br>ధాతౄన్ | బ్రహ్మను |
| 3. | धात्रा<br>ధాత్రా | धातृभ्यां<br>ధాతృభ్యాం | धातृभिः<br>ధాతృభిః | బ్రహ్మచేత/తో |
| 4. | धात्रे<br>ధాత్రే | धातृभ्यां<br>ధాతృభ్యాం | धातृभ्यः<br>ధాతృభ్యః | బ్రహ్మకొఱకు |
| 5. | धातुः<br>ధాతుః | धातृभ्यां<br>ధాతృభ్యాం | धातृभ्यः<br>ధాతృభ్యః | బ్రహ్మవలన |
| 6. | धातुः<br>ధాతుః | धात्रोः<br>ధాత్రోః | धातॄणाम्<br>ధాతౄణాం | బ్రహ్మకు |
| 7. | धातरि<br>ధాతరి | धात्रोः<br>ధాత్రోః | धातृषु<br>ధాతృషు | బ్రహ్మయందు |
| 8. | हे धातः<br>హే ధాతః | हे धातारौ<br>హే ధాతారౌ | हे धातारः<br>హే ధాతారః | ఓ బ్రహ్మా! |

సూచన :— పై 'ధాతృ' శబ్దమువలె శాస్తృ, కర్తృ, 'నప్తృ' శబ్దములకు విభక్తులను వ్రాసి అభ్యసింపుడు.



# ऋकारान्तः पुंलिगः 'पितृ' शब्दः

## ఋకారాంతః పుంలింగః 'పితృ' శబ్దః

| విభక్తి | ఏ. వ. | ద్వి. వ. | బ. వ. | ఏ. వ. అర్థము |
|---|---|---|---|---|
| 1. | पिता<br>పితా | पितरौ<br>పితరౌ | पितरः<br>పితరః | తండ్రి |
| 2. | पितरं<br>పితరం | पितरौ<br>పితరౌ | पितॄन्<br>పితౄన్ | తండ్రిని |
| 3. | पित्रा<br>పిత్రా | पितृभ्यां<br>పితృభ్యాం | पितृभिः<br>పితృభిః | తండ్రిచేత/తో |
| 4. | पित्रे<br>పిత్రే | पितृभ्यां<br>పితృభ్యాం | पितृभ्यः<br>పితృభ్యః | తండ్రి కొఱకు |
| 5. | पितुः<br>పితుః | पितृभ्यां<br>పితృభ్యాం | पितृभ्यः<br>పితృభ్యః | తండ్రివలన |
| 6. | पितुः<br>పితుః | पित्रोः<br>పిత్రోః | पितॄणाम्<br>పితౄణాం | తండ్రికి |
| 7. | पितरि<br>పితరి | पित्रोः<br>పిత్రోః | पितृषु<br>పితృషు | తండ్రియందు |
| 8. | हे पितः<br>హే పితః | हे पितरौ<br>హే పితరౌ | हे पितरः<br>హే పితరః | ఓ తండ్రీ! |

సూచన :—(1) పై 'పితృ'శబ్దానికీ 'ధాతృ'శబ్దానికీ ఉన్న వ్యత్యాసమును గుర్తింపుడు.

(2) పై పితృశబ్దమువలె భ్రాతృ, జామాతృ శబ్దములను వ్రాయుడు.

## 'ఆ'కారముతో ముగియు కొన్ని స్త్రీలింగశబ్దములు

| | | | |
|---|---|---|---|
| रमा<br>రమా | లక్ష్మి | कृपा<br>కృపా | దయ |
| सीता<br>సీతా | సీతాదేవి | निशा<br>నిశా | రాత్రి |
| भामा<br>భామా | స్త్రీ | शाखा<br>శాఖా | కొమ్మ |
| पद्मा<br>పద్మా | లక్ష్మి | आज्ञा<br>ఆజ్ఞా | ఆజ్ఞ |
| कन्या<br>కన్యా | కన్యక | कथा<br>కథా | కథ |
| गङ्गा<br>గంగా | గంగ | कला<br>కలా | కళ |
| माला<br>మాలా | పూల మాల | प्रजा<br>ప్రజా | ప్రజ |
| लता<br>లతా | తీగ | भार्या<br>భార్యా | భార్య |
| क्रीडा<br>క్రీడా | ఆట | लज्जा<br>లజ్జా | సిగ్గు |
| देवता<br>దేవతా | దేవత | क्षमा<br>క్షమా | ఓర్పు |
| सेना<br>సేనా | సైన్యము | प्रभा<br>ప్రభా | కాంతి |

సూచన :—కుడివైపు పేజీలో ఉన్న 'రమా' శబ్దమునకువలె పై శబ్దము లన్నింటికి విభక్తులను వ్రాసి అభ్యసింపుడు.



# आकारान्तः स्त्रीलिंगो 'रमा' शब्दः

## ఆకారాంతః స్త్రీలింగో 'రమా' శబ్దః

| విభక్తి | ఏ. వ. | ద్వి. వ. | బ. వ. | ఏ. వ. అర్థము |
|---|---|---|---|---|
| 1. | रमा<br>రమా | रमे<br>రమే | रमाः<br>రమాః | లక్ష్మి |
| 2. | रमां<br>రమాం | रमे<br>రమే | रमाः<br>రమాః | లక్ష్మిని |
| 3. | रमया<br>రమయా | रमाभ्यां<br>రమాభ్యాం | रमाभिः<br>రమాభిః | లక్ష్మిచేత/తో |
| 4. | रमायै<br>రమాయై | रमाभ्यां<br>రమాభ్యాం | रमाभ्यः<br>రమాభ్యః | లక్ష్మికొఱకు |
| 5. | रमायाः<br>రమాయాః | रमाभ्यां<br>రమాభ్యాం | रमाभ्यः<br>రమాభ్యః | లక్ష్మివలన |
| 6. | रमायाः<br>రమాయాః | रमयोः<br>రమయోః | रमाणाम्<br>రమాణాం | లక్ష్మియొక్క |
| 7. | रमायां<br>రమాయాం | रमयोः<br>రమయోః | रमासु<br>రమాసు | లక్ష్మియందు |
| 8. | हे रमे<br>హే రమే | हे रमे<br>హే రమే | हे रमाः<br>హే రమాః | ఓ లక్ష్మి! |

## 'ఇ'కారముతో ముగియు కొన్ని స్త్రీలింగశబ్దములు

| | | | | | |
|---|---|---|---|---|---|
| मतिः | మతిః | బుద్ధి | भक्तिः | భక్తిః | భక్తి |
| गतिः | గతిః | గతి | भूमिः | భూమిః | భూమి |
| श्रुतिः | శ్రుతిః | వేదము | मुक्तिः | ముక్తిః | మోక్షము |
| कृतिः | కృతిః | రచన | मूर्तिः | మూర్తిః | మూర్తి |
| सृष्टिः | సృష్టిః | సృష్టి | रात्रिः | రాత్రిః | రాత్రి |
| बुद्धिः | బుద్ధిః | బుద్ధి | रतिः | రతిః | ప్రేమ |
| रुचिः | రుచిః | రుచి | स्तुतिः | స్తుతిః | స్తోత్రము |
| कीर्तिः | కీర్తిః | కీర్తి | वृत्तिः | వృత్తిః | జీవిక |
| कान्तिः | కాంతిః | కాంతి | भूतिः | భూతిః | ఐశ్వర్యము |
| जातिः | జాతిః | జాతి | स्मृतिः | స్మృతిః | స్మరణము |
| प्रीतिः | ప్రీతిః | ప్రేమ | | | |

సూచన :—కుడివైపు పేజీలో ఉన్న 'మతి' శబ్దమునకువలె పై శబ్దము లన్నింటికి విభక్తులన్నీ వ్రాసి అభ్యసింపుడు.



# इकारान्तः स्त्रीलिंगो 'मति' शब्दः

## ఇకారాంతః స్త్రీలింగో 'మతి' శబ్దః

| విభక్తి | ఏ.వ | ద్వి. వ. | బ. వ. | ఏ. వ. అర్థము |
|---|---|---|---|---|
| 1. | मतिः<br>మతిః | मती<br>మతీ | मतयः<br>మతయః | బుద్ధి |
| 2. | मतिं<br>మతిం | मती<br>మతీ | मतीः<br>మతీః | బుద్ధిని |
| 3. | मत्या<br>మత్యా | मतिभ्यां<br>మతిభ్యాం | मतिभिः<br>మతిభిః | బుద్ధిచేత/తో |
| 4. | मत्यै, मतये<br>మత్యై, మతయే | मतिभ्यां<br>మతిభ్యాం | मतिभ्यः<br>మతిభ్యః | బుద్ధికొఱకు |
| 5. | मत्याः,मतेः<br>మత్యాః,మతేః | मतिभ्यां<br>మతిభ్యాం | मतिभ्यः<br>మతిభ్యః | బుద్ధివలన |
| 6. | मत्याः,मतेः<br>మత్యాః,మతేః | मत्योः<br>మత్యోః | मतीनां<br>మతీనాం | బుద్ధియొక్క |
| 7. | मत्यां, मतौ<br>మత్యాం, మతౌ | मत्योः<br>మత్యోః | मतिषु<br>మతిషు | బుద్ధియందు |
| 8. | हे मते<br>హే మతే | हे मती<br>హే మతీ | हे मतयः<br>హే మతయః | ఓ బుద్ధీ! |

సూచన :—పై శబ్దములో చతుర్థీ, పంచమీ, షష్ఠీ, సప్తమీ విభక్తుల ఏకవచనములలో రెండు రూపాలుండుటను గుర్తింపుడు.

## 'ఈ'కారముతో ముగియు కొన్ని స్త్రీలింగశబ్దములు

| | | | | |
|---|---|---|---|---|
| गौरी<br>గౌరీ | పార్వతి | | वापी<br>వాపీ | బావి |
| वाणी<br>వాణీ | సరస్వతి | | दासी<br>దాసీ | పనికత్తె |
| नदी<br>నదీ | నది | | देवी<br>దేవీ | దేవి |
| नारी<br>నారీ | స్త్రీ | | भागीरथी<br>భాగీరథీ | గంగ |
| पत्नी<br>పత్నీ | భార్య | | श्रेणी<br>శ్రేణీ | వరుస |
| सखी<br>సఖీ | చెలియ | | सिंही<br>సింహీ | ఆడుసింహము |
| पुरी<br>పురీ | నగరము | | हरिणी<br>హరిణీ | ఆడుజింక |
| नटी<br>నటీ | ఆటకత్తె | | शर्वरी<br>శర్వరీ | రాత్రి |
| मही<br>మహీ | భూమి | | वेणी<br>వేణీ | జడ |
| कुमारी<br>కుమారీ | కూతురు | | मृगी<br>మృగీ | ఆడుజింక |
| जननी<br>జననీ | తల్లి | | करिणी<br>కరిణీ | ఆడు ఏనుగు |

సూచన :—కుడివైపు పేజీలో ఉన్న 'గౌరీ' శబ్దమునకువలె పై శబ్దాలన్నింటికి విభక్తులను వ్రాయుడు.



# ईकारान्तः स्त्रीलिंगो 'गौरी' शब्दः

## ఈకారాంతః స్త్రీలింగో 'గౌరీ' శబ్దః

| విభక్తి | ఏ. వ. | ద్వి. వ. | బ. వ. | ఏ. వ. అర్థము |
|---|---|---|---|---|
| 1. | गौरी<br>గౌరీ | गौर्यौ<br>గౌర్యౌ | गौर्यः<br>గౌర్యః | పార్వతి |
| 2. | गौरीं<br>గౌరీం | गौर्यौ<br>గౌర్యౌ | गौरीः<br>గౌరీః | పార్వతిని |
| 3. | गौर्या<br>గౌర్యా | गौरीभ्यां<br>గౌరీభ్యాం | गौरीभिः<br>గౌరీభిః | పార్వతిచేత |
| 4. | गौर्यै<br>గౌర్యై | गौरीभ्यां<br>గౌరీభ్యాం | गौरीभ्यः<br>గౌరీభ్యః | పార్వతికొఱకు |
| 5. | गौर्याः<br>గౌర్యాః | गौरीभ्यां<br>గౌరీభ్యాం | गौरीभ्यः<br>గౌరీభ్యః | పార్వతివలన |
| 6. | गौर्याः<br>గౌర్యాః | गौर्योः<br>గౌర్యోః | गौरीणाम्<br>గౌరీణాం | పార్వతియొక్క |
| 7. | गौर्यां<br>గౌర్యాం | गौर्योः<br>గౌర్యోః | गौरीषु<br>గౌరీషు | పార్వతియందు |
| 8. | हे गौरि<br>హే గౌరి | हे गौर्यौ<br>హే గౌర్యౌ | हे गौर्यः<br>హే గౌర్యః | ఓ పార్వతీ! |

# उकारान्तः स्त्रीलिंगो 'धेनु' शब्दः

## ఉకారాంతః స్త్రీలింగో 'ధేను' శబ్దః

| విభక్తి | ఏ. వ. | ద్వి. వ. | బ. వ. | ఏ. వ. అర్థము |
|---|---|---|---|---|
| 1. | धेनुः<br>ధేనుః | धेनू<br>ధేనూ | धेनवः<br>ధేనవః | ఆవు |
| 2. | धेनुं<br>ధేనుం | धेनू<br>ధేనూ | धेनूः<br>ధేనూః | ఆవును |
| 3. | धेन्वा<br>ధేన్వా | धेनुभ्यां<br>ధేనుభ్యాం | धेनुभिः<br>ధేనుభిః | ఆవుచేత/తో |
| 4. | धेन्वै,धेनवे<br>ధేన్వై, ధేనవే | धेनुभ्यां<br>ధేనుభ్యాం | धेनुभ्यः<br>ధేనుభ్యః | ఆవుకొఱకు |
| 5. | धेन्वाः,धेनोः<br>ధేన్వాః, ధేనోః | धेनुभ्यां<br>ధేనుభ్యాం | धेनुभ्यः<br>ధేనుభ్యః | ఆవువలన |
| 6. | धेन्वाः,धेनोः<br>ధేన్వాః, ధేనోః | धेन्वोः<br>ధేన్వోః | धेनूनाम्<br>ధేనూనాం | ఆవుయొక్క |
| 7. | धेन्वां,धेनौ<br>ధేన్వాం, ధేనౌ | धेन्वोः<br>ధేన్వోః | धेनुषु<br>ధేనుషు | ఆవునందు |
| 8. | हे धेनो<br>హే ధేనో | हे धेनू<br>హే ధేనూ | हे धेनवः<br>హే ధేనవః | ఓ ఆవా ! |

సూచన:— పై 'ధేను' శబ్దములో చతుర్థీ, పంచమీ, షష్ఠీ, సప్తమీ విభక్తుల ఏకవచనంలో రెండు రూపాలుండుటను గుర్తింపుడు.



# ऋकारान्तः स्त्रीलिंगो 'मातृ' शब्दः

## ఋకారాంతః స్త్రీలింగో 'మాతృ' శబ్దః

| విభక్తి | ఏ. వ. | ద్వి. వ. | బ. వ. | ఏ. వ. అర్థము |
|---|---|---|---|---|
| 1. | माता<br>మాతా | मातरौ<br>మాతరౌ | मातरः<br>మాతరః | తల్లి |
| 2. | मातरं<br>మాతరం | मातरौ<br>మాతరౌ | मातॄः<br>మాతౄః | తల్లిని |
| 3. | मात्रा<br>మాత్రా | मातृभ्यां<br>మాతృభ్యాం | मातृभिः<br>మాతృభిః | తల్లిచేత/తో |
| 4. | मात्रे<br>మాత్రే | मातृभ्यां<br>మాతృభ్యాం | मातृभ्यः<br>మాతృభ్యః | తల్లికొఱకు |
| 5. | मातुः<br>మాతుః | मातृभ्यां<br>మాతృభ్యాం | मातृभ्यः<br>మాతృభ్యః | తల్లివలన |
| 6. | मातुः<br>మాతుః | मात्रोः<br>మాత్రోః | मातॄणाम्<br>మాతౄణాం | తల్లియొక్క |
| 7. | मातरि<br>మాతరి | मात्रोः<br>మాత్రోః | मातृषु<br>మాతృషు | తల్లియందు |
| 8. | हे मातः<br>హే మాతః | हे मातरौ<br>హే మాతరౌ | हे मातरः<br>హే మాతరః | ఓ తల్లీ |

సూచన:— పై 'మాతృ' శబ్దమువలె స్వసృ, యాతృ, దుహితృ, ననాందృ శబ్దములకు విభక్తులను వ్రాసి అభ్యసింపుడు.

## అకారముతో ముగియు కొన్ని నపుంసకలింగ శబ్దములు

| | | | |
|---|---|---|---|
| ज्ञानं | | वाक्यम् | |
| జ్ఞానం | జ్ఞానము | వాక్యం | వాక్యము |
| जलं | | तत्त्वम् | |
| జలం | నీరు | తత్త్వం | యథార్థము |
| फलं | | दानम् | |
| ఫలం | పండు | దానం | దానము |
| धनं | | पुण्यम् | |
| ధనం | ధనము | పుణ్యం | పుణ్యము |
| वनं | | पापम् | |
| వనం | అడవి | పాపం | పాపము |
| पद्मं | | अन्नम् | |
| పద్మం | తామరపువ్వు | అన్నం | అన్నము |
| नेत्रं | | द्रव्यम् | |
| నేత్రం | కన్ను | ద్రవ్యం | ద్రవ్యము |
| गात्रं | | शुभम् | |
| గాత్రం | శరీరము | శుభం | శుభము |
| सत्यं | | भयम् | |
| సత్యం | నిజము | భయం | భయము |
| नृत्यं | | भद्रम् | |
| నృత్యం | నర్తనము | భద్రం | మంగళము |

సూచన :— ఈ పేజీలోని శబ్దాలన్నింటికి కుడివైపు పేజీలో ఉన్న 'జ్ఞాన' శబ్దమునకు వలె విభక్తులను వ్రాసి అభ్యసింపుడు.



# अकारान्त नपुंसकलिंगो 'ज्ञान' शब्दः

## అకారాంత నపుంసకలింగో 'జ్ఞాన' శబ్దః

| విభక్తి | ఏ. వ. | ద్వి. వ. | బ. వ. | ఏ. వ. అర్థము |
|---|---|---|---|---|
| 1. | ज्ञानं | ज्ञाने | ज्ञानानि | |
| | జ్ఞానం | జ్ఞానే | జ్ఞానాని | జ్ఞానము |
| 2. | ज्ञानं | ज्ञाने | ज्ञानानि | |
| | జ్ఞానం | జ్ఞానే | జ్ఞానాని | జ్ఞానమును |
| 3. | ज्ञानेन | ज्ञानाभ्यां | ज्ञानैः | |
| | జ్ఞానేన | జ్ఞానాభ్యాం | జ్ఞానైః | జ్ఞానము చేత |
| 4. | ज्ञानाय | ज्ञानाभ्यां | ज्ञानेभ्यः | |
| | జ్ఞానాయ | జ్ఞానాభ్యాం | జ్ఞానేభ్యః | జ్ఞానము కొఱకు |
| 5. | ज्ञानात् | ज्ञानाभ्यां | ज्ञानेभ्यः | |
| | జ్ఞానాత్ | జ్ఞానాభ్యాం | జ్ఞానేభ్యః | జ్ఞానమువలన |
| 6. | ज्ञानस्य | ज्ञानयोः | ज्ञानानाम् | |
| | జ్ఞానస్య | జ్ఞానయోః | జ్ఞానానాం | జ్ఞానముయొక్క |
| 7. | ज्ञाने | ज्ञानयोः | ज्ञानेषु | |
| | జ్ఞానే | జ్ఞానయోః | జ్ఞానేషు | జ్ఞానమందు |
| 8. | हे ज्ञान ! | हे ज्ञाने ! | हे ज्ञानानि ! | |
| | హే జ్ఞాన! | హే జ్ఞానే! | హే జ్ఞానాని! | ఓ జ్ఞానమా! |

# इकारान्त नपुंसकलिंगो 'वारि' शब्दः

ఇకారాంత నపుంసకలింగో 'వారి' శబ్దః

| విభక్తి | ఏ. వ. | ద్వి వ. | బ. వ. | ఏ. వ. అర్థము |
|---|---|---|---|---|
| 1. | वारि<br>వారి | वारिणी<br>వారిణీ | वारीणि<br>వారీణి | నీరు |
| 2. | वारि<br>వారి | वारिणी<br>వారిణీ | वारीणि<br>వారీణి | నీటిని |
| 3. | वारिणा<br>వారిణా | वारिभ्यां<br>వారిభ్యాం | वारिभिः<br>వారిభిః | నీటిచేత |
| 4. | वारिणे<br>వారిణే | वारिभ्यां<br>వారిభ్యాం | वारिभ्यः<br>వారిభ్యః | నీటి కొఱకు |
| 5. | वारिणः<br>వారిణః | वारिभ्यां<br>వారిభ్యాం | वारिभ्यः<br>వారిభ్యః | నీటివలన |
| 6. | वारिणः<br>వారిణః | वारिणोः<br>వారిణోః | वारीणाम्<br>వారీణాం | నీటి యొక్క |
| 7. | वारिणि<br>వారిణి | वारिणोः<br>వారిణోః | वारिषु<br>వారిషు | నీటియందు |
| 8. | हे वारे,हे वारि<br>హేవారే,హేవారి | हे वारिणी<br>హే వారిణీ | हे वारीणि<br>హే వారీణి | ఓ నీరా! |



# కొన్ని విశేష శబ్దములు

## इकारान्तः पुंलिंगः 'सखि' शब्दः

ఇకారాంతః పుంలింగః 'సఖి' శబ్దః

| విభక్తి | ఏ. వ. | ద్వి. వ. | బ. వ | ఏ. వ. అర్థము |
|---|---|---|---|---|
| 1. | सखा<br>సఖా | सखायौ<br>సఖాయౌ | सखायः<br>సఖాయః | మిత్రుడు |
| 2. | सखायं<br>సఖాయం | सखायौ<br>సఖాయౌ | सखीन्<br>సఖీన్ | మిత్రుని |
| 3. | सख्या<br>సఖ్యా | सखिभ्यां<br>సఖిభ్యాం | सखिभिः<br>సఖిభిః | మిత్రుని చేత |
| 4. | सख्ये<br>సఖ్యే | सखिभ्यां<br>సఖిభ్యాం | सखिभ्यः<br>సఖిభ్యః | మిత్రుని కొఱకు |
| 5. | सख्युः<br>సఖ్యుః | सखिभ्यां<br>సఖిభ్యాం | सखिभ्यः<br>సఖిభ్యః | మిత్రునివలన |
| 6. | सख्युः<br>సఖ్యుః | सख्योः<br>సఖ్యోః | सखीनाम्<br>సఖీనాం | మిత్రునియొక్క |
| 7. | सख्यौ<br>సఖ్యౌ | सख्योः<br>సఖ్యోః | सखिषु<br>సఖిషు | మిత్రునియందు |
| 8. | हे सखे<br>హే సఖే | हे सखायौ<br>హే సఖాయౌ | हे सखायः<br>హే సఖాయః | ఓ మిత్రమా! |

సూచన:—పై 'సఖి' శబ్దంలోని విభక్తుల రూపాలు విచిత్రంగా ఉన్నందుచేత కంఠస్థం చేయటం అవసరం.

# नकारान्तः पुंलिंगो 'राजन्' शब्दः

## నకారాంతః పుంలింగో 'రాజన్' శబ్దః

| విభక్తి | ఏ. వ. | ద్వి. వ. | బ. వ. | ఏ. వ. అర్థము |
|---|---|---|---|---|
| 1. | राजा | राजानौ | राजानः | |
| | రాజా | రాజానౌ | రాజానః | రాజు |
| 2. | राजानं | राजानौ | राज्ञः | |
| | రాజానం | రాజానౌ | రాజ్ఞః | రాజును |
| 3. | राज्ञा | राजभ्यां | राजभिः | |
| | రాజ్ఞా | రాజభ్యాం | రాజభిః | రాజు చేత |
| 4. | राज्ञे | राजभ्यां | राजभ्यः | |
| | రాజ్ఞే | రాజభ్యాం | రాజభ్యః | రాజు కొఱకు |
| 5. | राज्ञः | राजभ्यां | राजभ्यः | |
| | రాజ్ఞః | రాజభ్యాం | రాజభ్యః | రాజువలన |
| 6. | राज्ञः | राज्ञोः | राज्ञाम् | |
| | రాజ్ఞః | రాజ్ఞోః | రాజ్ఞాం | రాజుయొక్క |
| 7. | राज्ञि, राजनि | राज्ञोः | राजसु | |
| | రాజ్ఞి, రాజని | రాజ్ఞోః | రాజసు | రాజునందు |
| 8. | हे राजन् | हे राजानौ | हे राजानः | |
| | హే రాజన్ | హే రాజానౌ | హే రాజానః | ఓ రాజా! |

సూచన :—(1) 'రాజన్' శబ్దంలో సప్తమీ విభక్తి ఏక వచనంలో రెండు రూపము లుండుటను గుర్తింపుడు.

(2) ఈ శబ్దమునకున్న విభక్తులన్నింటినీ కంఠస్థము చేయవలెను.



# नकारान्त नपुंसकलिंगो 'नामन्' शब्दः

## నకారాంత నపుంసకలింగో 'నామన్' శబ్దః

| విభక్తి | ఏ. వ. | ద్వి. వ. | బ. వ. | ఏ వ. అర్థము |
|---|---|---|---|---|
| 1. | नाम | नाम्नी, नामनी | नामानि | |
| | నామ | నామ్నీ, నామనీ | నామాని | పేరు |
| 2. | नाम | नाम्नी, नामनी | नामानि | |
| | నామ | నామ్నీ, నామనీ | నామాని | పేరును |
| 3. | नाम्ना | नामभ्यां | नामभिः | |
| | నామ్నా | నామభ్యాం | నామభిః | పేరుచేత |
| 4. | नाम्ने | नामभ्यां | नामभ्यः | |
| | నామ్నే | నామభ్యాం | నామభ్యః | పేరుకొఱకు |
| 5. | नाम्नः | नामभ्यां | नामभ्यः | |
| | నామ్నః | నామభ్యాం | నామభ్యః | పేరువలన |
| 6. | नाम्नः | नाम्नोः | नाम्नाम् | |
| | నామ్నః | నామ్నోః | నామ్నాం | పేరుయొక్క |
| 7. | नाम्नि, नामनि | नाम्नोः | नामसु | |
| | నామ్ని, నామని | నామ్నోః | నామసు | పేరునందు |
| 8. | हेनामन् ,हेनाम | हेनाम्नी, हेनामनी | हे नामानि | |
| | హేనామన్, హేనామ | హేనామ్నీ, హేనామనీ | హే నామాని | ఓ పేరా! |

సూచన :—(1) పై నామన్ శబ్దమున ప్రథమా ద్వితీయా విభక్తుల ద్వివచనంలోను, సప్తమీ ఏకవచనంలోను సంబోధన ప్రథమ ఏకవచన ద్వివచనాల లోను రెండు రెండు రూపములున్న విషయం గుర్తు పెట్టి కంఠస్థం చేయవలెను.

(2) ఇదే రీతిలో ధామన్, దామన్, వ్యోమన్ శబ్దాలకు విభక్తులను వ్రాసి అభ్యసింపుడు.

# नकारान्तः पुंलिग 'आत्मन्' शब्दः

## నకారాంతః పుంలింగ 'ఆత్మన్' శబ్దః

| విభక్తి | ఏ. వ. | ద్వి. వ. | బ. వ. | ఏ. వ. అర్థము |
|---|---|---|---|---|
| 1. | आत्मा<br>ఆత్మా | आत्मानौ<br>ఆత్మానౌ | आत्मानः<br>ఆత్మానః | <br>ఆత్మ |
| 2. | आत्मानं<br>ఆత్మానం | आत्मानौ<br>ఆత్మానౌ | आत्मनः<br>ఆత్మనః | <br>ఆత్మను |
| 3. | आत्मना<br>ఆత్మనా | आत्मभ्यां<br>ఆత్మభ్యాం | आत्मभिः<br>ఆత్మభిః | <br>ఆత్మచేత |
| 4. | आत्मने<br>ఆత్మనే | आत्मभ्यां<br>ఆత్మభ్యాం | आत्मभ्यः<br>ఆత్మభ్యః | <br>ఆత్మకొఱకు |
| 5. | आत्मनः<br>ఆత్మనః | आत्मभ्यां<br>ఆత్మభ్యాం | आत्मभ्यः<br>ఆత్మభ్యః | <br>ఆత్మవలన |
| 6. | आत्मनः<br>ఆత్మనః | आत्मनोः<br>ఆత్మనోః | आत्मनाम्<br>ఆత్మనాం | <br>ఆత్మయొక్క |
| 7. | आत्मनि<br>ఆత్మని | आत्मनोः<br>ఆత్మనోః | आत्मसु<br>ఆత్మసు | <br>ఆత్మయందు |
| 8. | हे आत्मन् !<br>హే ఆత్మన్! | हे आत्मानौ !<br>హే ఆత్మానౌ! | हे आत्मानः<br>హే ఆత్మానః | <br>ఓ ఆత్మా! |

సూచన:— పై ఆత్మన్ శబ్దమువలే, బ్రహ్మన్, పాప్మన్, సహకృత్వన్ శబ్దాలకు విభక్తులన్నీ వ్రాసి అభ్యసింపుడు.



# सकारान्त नपुंसकलिंगो 'मनस्' शब्दः

## సకారాంత నపుంసకలింగో 'మనస్' శబ్దః

| విభక్తి | ఏ. వ. | ద్వి. వ. | బ. వ. | ఏ. వ. అర్థము |
|---|---|---|---|---|
| 1. | मनः<br>మనః | मनसी<br>మనసీ | मनांसि<br>మనాంసి | <br>మనస్సు |
| 2. | मनः<br>మనః | मनसी<br>మనసీ | मनांसि<br>మనాంసి | <br>మనస్సును |
| 3. | मनसा<br>మనసా | मनोभ्यां<br>మనోభ్యాం | मनोभिः<br>మనోభిః | <br>మనస్సుచేత |
| 4. | मनसे<br>మనసే | मनोभ्यां<br>మనోభ్యాం | मनोभ्यः<br>మనోభ్యః | <br>మనస్సు కొఱకు |
| 5. | मनसः<br>మనసః | मनोभ्यां<br>మనోభ్యాం | मनोभ्यः<br>మనోభ్యః | <br>మనస్సువలన |
| 6. | मनसः<br>మనసః | मनसोः<br>మనసోః | मनसाम्<br>మనసాం | <br>మనస్సుయొక్క |
| 7. | मनसि<br>మనసి | मनसोः<br>మనసోః | मनस्सु<br>మనస్సు | <br>మనస్సునందు |
| 8. | हे मनः<br>హే మనః | हे मनसी<br>హే మనసీ | हे मनांसि<br>హే మనాంసి | <br>ఓ మనసా! |

సూచన:—ఈ 'మనస్' శబ్దమును బాగా కంఠస్థము చేయవలెను.

# విభక్తులతో వాక్యప్రయోగము

ప్రథమా విభక్తి పదములున్న వాక్యములు :—

| | | |
|---|---|---|
| रामः<br>రామః | पठति<br>పఠతి | రాముడు చదువుచున్నాడు |
| हरिः<br>హరిః | वदति<br>వదతి | హరి మాటాడుచున్నాడు |
| नृपः<br>నృపః | पालयति<br>పాలయతి | రాజు పాలించుచున్నాడు |
| मेघः<br>మేఘః | वर्षति<br>వర్షతి | మేఘము వర్షించుచున్నది |
| नरः<br>నరః | नमति<br>నమతి | మనుష్యుడు నమస్కరించుచున్నాడు |
| कृषीवलः<br>కృషీవలః | कर्षति<br>కర్షతి | కర్షకుడు దున్నుచున్నాడు |
| नदी<br>నదీ | प्रवहति<br>ప్రవహతి | నది ప్రవహించుచున్నది |
| बालः<br>బాలః | क्रीडति<br>క్రీడతి | బాలుడు ఆడుచున్నాడు |
| रथः<br>రథః | धावति<br>ధావతి | రథము పరుగిడుచున్నది |



ద్వితీయా విభక్తి పదములున్న వాక్యములు :—

| | | |
|---|---|---|
| सत्यं<br>సత్యం | वदति<br>వదతి | సత్యమును పలుకుచున్నాడు |
| राज्यं<br>రాజ్యం | पालयति<br>పాలయతి | రాజ్యమును పాలించుచున్నాడు |
| सूर्यं<br>సూర్యం | नमति<br>నమతి | సూర్యుని నమస్కరించుచున్నాడు |
| भूमिं<br>భూమిం | कर्षति<br>కర్షతి | నేలను దున్నుచున్నాడు |
| ग्रामं<br>గ్రామం | गच्छति<br>గచ్ఛతి | గ్రామమును గురించి వెళ్ళుచున్నాడు |
| तृणं<br>తృణం | स्पृशति<br>స్పృశతి | గడ్డిని తాకుచున్నాడు |
| कार्यं<br>కార్యం | करोति<br>కరోతి | పనిని చేయుచున్నాడు |
| शकटं<br>శకటం | नयति<br>నయతి | బండిని తీసుకొని వెళ్ళుచున్నాడు |
| भारं<br>భారం | वहति<br>వహతి | బరువును మోయుచున్నాడు |
| पुस्तकं<br>పుస్తకం | पठति<br>పఠతి | పుస్తకమును చదువుచున్నాడు |
| धनं<br>ధనం | ददाति<br>దదాతి | ధనమును ఇచ్చుచున్నాడు |

తృతీయా విభక్తి పదములున్న వాక్యములు:—

बाणेन ताडयति
బాణేన తాడయతి — బాణముతో కొట్టుచున్నాడు

नेत्रेण पश्यति
నేత్రేణ పశ్యతి — కంటితో చూచుచున్నాడు

शकटेन गच्छति
శకటేన గచ్ఛతి — బండితో వెళ్ళుచున్నాడు

जलेन सिञ्चति
జలేన సించతి — నీటితో తడుపుచున్నాడు

अग्निना दहति
అగ్నినా దహతి — నిప్పుతో కాల్చుచున్నాడు

रामेण (सह) पठति
రామేణ (సహ) పఠతి — రామునితో చదువుచున్నాడు

त्वया विना न गतिः
త్వయా వినా న గతిః — నీవు దప్ప గతిలేదు

वर्षेण विना न सस्यानि
వర్షేణ వినా న సస్యాని — వర్షము లేనిదే పైరు లేదు

विद्यया विलसति
విద్యయా విలసతి — విద్యతో ఒప్పుచున్నాడు

विनयेन विराजते
వినయేన విరాజతే — వినయముచే ప్రకాశించుచున్నాడు



చతుర్థీ విభక్తి పదములున్న వాక్యములు:—

भिक्षुकाय तण्डुलं
భిక్షుకాయ తండులం — భిక్షుకుని కొఱకు బియ్యము

गुरवे नमः
గురవే నమః — గురువు కొఱకు నమస్కారము

इन्द्राय स्वाहा
ఇంద్రాయ స్వాహా — ఇంద్రుని కొఱకు ఆహుతి దానము

पितृभ्यः स्वधा
పితృభ్యః స్వధా — పితరుల కొఱకు పిండ దానము

प्रजाभ्यः स्वस्ति
ప్రజాభ్యః స్వస్తి — ప్రజల కొఱకు క్షేమము

ज्ञानाय पठति
జ్ఞానాయ పఠతి — జ్ఞానము కొఱకు చదువుచున్నాడు

आहाराय भ्रमति
ఆహారాయ భ్రమతి — ఆహారము కొఱకై తిరుగుచున్నాడు

मात्रे नमः
మాత్రే నమః — తల్లి కొఱకు నమస్కారము

## పంచమీ విభక్తి పదములున్న వాక్యములు:—

| | | |
|---|---|---|
| वृक्षात् पतति | వృక్షాత్ పతతి | చెట్టు నుండి పడుచున్నాడు (పడుచున్నది) |
| पत्तनात् आगच्छति | పత్తనాత్ ఆగచ్ఛతి | పట్టణమునుండి వచ్చుచున్నాడు |
| पर्वतात् प्रवहति | పర్వతాత్ ప్రవహతి | కొండనుండి ప్రవహించుచున్నది |
| कूपात् उद्धरति | కూపాత్ ఉద్ధరతి | బావినుండి తోడుచున్నాడు |
| व्याघ्रात् बिभेति | వ్యాఘ్రాత్ బిభేతి | పులివలన భయపడుచున్నాడు |
| क्रोधात् पापं भवति | క్రోధాత్ పాపం భవతి | కోపమువలన పాపము వచ్చును |
| कृष्णात् श्रेष्ठतरः | కృష్ణాత్ శ్రేష్ఠతరః | కృష్ణునికంటె మిక్కిలి శ్రేష్ఠుడు |
| नगरात् बहिः | నగరాత్ బహిః | నగరమునకు వెలుపల |
| अर्थात् सुखम् | అర్థాత్ సుఖం | సంపదవలన సుఖము |
| चोरात् भयं अस्ति | చోరాత్ భయం అస్తి | దొంగవలన భయము కలదు |



## షష్ఠీ విభక్తి పదములున్న వాక్యములు:—

| | | |
|---|---|---|
| रामस्य पुस्तक | రామస్య పుస్తకం | రామునియొక్క పుస్తకము |
| पुस्तकस्य मूल्यम् | పుస్తకస్య మూల్యం | పుస్తకముయొక్క వెల |
| हरेः दर्शनम् | హరేః దర్శనం | విష్ణువుయొక్క దర్శనము |
| गुरोः अनुग्रहः | గురోః అనుగ్రహః | గురువుయొక్క అనుగ్రహము |
| धेनोः क्षीरम् | ధేనోః క్షీరం | ఆవుయొక్క పాలు |
| वृक्षस्य शाखा | వృక్షస్య శాఖా | చెట్టుయొక్క కొమ్మ |
| शुकस्य वर्णः | శుకస్య వర్ణః | చిలుకయొక్క రంగు |
| पर्वतस्य शिखरम् | పర్వతస్య శిఖరం | పర్వతముయొక్క శిఖరము |
| शिवस्य कृपा | శివస్య కృపా | శివునియొక్క దయ |
| राज्ञः आज्ञा | రాజ్ఞః ఆజ్ఞా | రాజుయొక్క ఆజ్ఞ |

## సప్తమీ విభక్తి పదములున్న వాక్యములు:—

**नगरे वसति**
నగరే వసతి — నగరమందు నివసించుచున్నాడు

**आसने उपविशति**
ఆసనే ఉపవిశతి — ఆసనమందు కూర్చొను చున్నాడు

**पर्वते वर्तते**
పర్వతే వర్తతే — పర్వతమందు ఉన్నది

**वृक्षे तिष्ठति**
వృక్షే తిష్ఠతి — చెట్టునందున్నది

**पुस्तके लिखति**
పుస్తకే లిఖతి — పుస్తకమునందు వ్రాయుచున్నాడు

**भूमौ प्लवते**
భూమౌ ప్లవతే — భూమిమీద గంతులువేయుచున్నాడు

**गुरौ भक्तिः**
గురౌ భక్తిః — గురువునందు భక్తి

**गृहे अस्ति**
గృహే అస్తి — గృహమందు ఉన్నాడు

**हस्ते किम्?**
హస్తే కిమ్ — చేతియందు ఏమి? (కలదు)



## సంబోధన ప్రథమ పదములున్న వాక్యములు:—

**हे राम! रक्ष**
హే రామ రక్ష — ఓ రామా రక్షించు

**रे बाल! आगच्छ**
రే బాల ఆగచ్ఛ — ఒరే బాలుడా రమ్ము

**भो मित्र! पठ**
భో మిత్ర! పఠ — ఓ మిత్రుడా! చదువుము

**अयि बालिके!**
అయి బాలికే! — ఓసీ బాలికా!

**रे दुष्ट! मां त्यज**
రే దుష్ట! మాం త్యజ — ఓరీ దుష్టుడా! నన్ను విడువుము

**रेरे वञ्चक! गच्छ**
రేరే వంచక! గచ్ఛ — ఓరీ వంచకుడా! పొమ్ము

**हे मातः! धनं देहि**
హే మాతః ధనం దేహి — అమ్మా! ధనము నిమ్ము

గమనిక:—క్రియలకు లింగములు లేవు. అందువలన క్రియారూపము మూడు లింగములలోను ఒకే విధముగా ఉండును.

ఉదా:—సః పచతి = వాడు వండుచున్నాడు. సా పచతి = ఆమె వండుచున్నది. ఇట్లే పఠతి = చదువుచున్నాడు. చదువుచున్నది మొదలైనవి గ్రహింపవలెను.

# సర్వనామ శబ్దాలు

ఒకనామ వాచక శబ్దానికి బదులుగా ఒక వాక్యములో ప్రయోగించే శబ్దానికి సర్వనామ శబ్దమని పేరు.

సంస్కృత భాషలోని సర్వనామ శబ్దాలను ఆరు విధాలుగా విభజించవచ్చు. అవి—

1. పురుష (వ్యక్తి) వాచకము : युष्मत् (నీవు). अस्मत् (నేను). भवत् (తాము). स्व (తనయొక్క).

2. సంబంధార్థకములు : यद् (ఎవరు, ఏది). మరియు 'తతర' 'తతమ' ప్రత్యయాలు.

3. ప్రశ్నార్థకములు : किम् (ఎవరు, ఏది).

4. నిరూపణార్థకములు : सर्व, विश्व, सम, सिम (అన్నీ). अन्य (వేరే). अन्यतर (రెంటిలో ఒకటి). त्वत्, त्व, इतर (తతిమ్మా) नेम (సగము). तद्, अदस् (అది) एतद्, इदं (ఇది).

5. సంఖ్యా వాచకములు : एक (ఒకటి). द्वि (రెండు). उभ, उभय (రెండును).

6. దిగ్వాచకములు : पूर्व (తూర్పు). अवर (పడమటి). दक्षिण (దక్షిణములోని). उत्तर (ఉత్తరమున). अपर (వేరే). अधर (తక్కువ రకానికి చెందిన). अन्तर (లోపలున్న).

పైగా చెప్పిన ఆరు రకాలైన సర్వనామ శబ్దాలలో 1. పురుష వాచకాలు 2. ప్రశ్నార్థకాలు 5. సంఖ్యావాచకాలు ఇవి మాత్రమే ఈ పుస్తకంలో ఇవ్వబడ్డాయి.

# పురుషవాచక సర్వనామ శబ్దములు

## दकारान्तः पुंलिंगः (त्रिषु लिंगेषु समानः)

## 'अस्मद्' शब्दः

దకారాంతః పుంలింగః (త్రిషు లింగేషు సమానః)

'అస్మద్' శబ్దః

| విభక్తి | ఏకవచనము | ద్వివచనము | బహువచనము | ఏ. వ. అర్థము |
|---|---|---|---|---|
| 1. | अहं<br>అహం | आवां<br>ఆవాం | वयम<br>వయం | నేను |
| 2. | मां, मा<br>మాం, మా | आवां, नौ<br>ఆవాం, నౌ | अस्मान्, नः<br>అస్మాన్, నః | నన్ను |
| 3. | मया<br>మయా | आवाभ्यां<br>ఆవాభ్యాం | अस्माभिः<br>అస్మాభిః | నాచేత/తో |
| 4. | मह्यं, मे<br>మహ్యం, మే | आवाभ्यां, नौ<br>ఆవాభ్యాం, నౌ | अस्मभ्यं, नः<br>అస్మభ్యం, నః | నాకొఱకు/నాకై |
| 5. | मत्<br>మత్ | आवाभ्यां<br>ఆవాభ్యాం | अस्मत्<br>అస్మత్ | నావలన/కంటె |
| 6. | मम, मे<br>మమ, మే | आवयोः, नौ<br>ఆవయోః, నౌ | अस्माकं, नः<br>అస్మాకం, నః | నాయొక్క/కు |
| 7. | मयि<br>మయి | आवयोः<br>ఆవయోః | अस्मासु<br>అస్మాసు | నాయందు |

సూచన :—(1) ఈ 'అస్మత్' శబ్దమును బాగా కంఠస్థము చేయవలెను.

(2) ద్వితీయ, చతుర్థి, షష్ఠీ విభక్తులలో రెండు రెండు రూపము లుండుటను గుర్తింపుడు.

(3) ఈ శబ్దమునకు సంబోధనము లేదు.

# दकारान्तः (त्रिषु लिंगेषु समानः)

## 'युष्मद्' शब्दः

దకారాంతః (త్రిషు లింగేషు సమానః) 'యుష్మద్' శబ్దః

| | ఏ. వ. | ద్వి. వ | బ వ. | ఏ. వ. అ. |
|---|---|---|---|---|
| 1. | त्वं<br>త్వం | युवां<br>యువాం | यूयं<br>యూయం | నీవు |
| 2. | त्वां, त्वा<br>త్వాం. త్వా | युवां, वां<br>యువాం. వాం | युष्मान् वः<br>యుష్మాన్ వః | నిన్ను |
| 3. | त्वया<br>త్వయా | युवाभ्यां<br>యువాభ్యాం | युष्माभिः<br>యుష్మాభిః | నీచేత/తో |
| 4. | तुभ्यं, ते<br>తుభ్యం.తే | युवाभ्यां, वां<br>యువాభ్యాం.వాం | युष्मभ्यं, वः<br>యుష్మభ్యం. వః | నీ కొఱకు/కై |
| 5. | त्वत्<br>త్వత్ | युवाभ्यां<br>యువాభ్యాం | युष्मत्<br>యుష్మత్ | నీ వలన/కంటె |
| 6. | तव, ते<br>తవ. తే | युवयोः, वां<br>యువయోః.వాం | युष्माकं, वः<br>యుష్మాకం. వః | నీ యొక్క/కు |
| 7. | त्वयि<br>త్వయి | युवयोः<br>యువయోః | युष्मासु<br>యుష్మాసు | నీ యందు |

సూచన :—(1) ఈ శబ్దానికి సంభోధనము లేదు.

(2) ఈ శబ్దములో రెండు రెండు రూపాలున్న విభక్తులను గుర్తింపుః

(3) ఈ శబ్దాన్ని కూడా తప్పక కంఠస్థము చేయవలెను.



# दकारान्तः पुंलिंगः 'तद्' शब्दः

దకారాంతః పుంలింగః 'తద్' శబ్దః

| | ఏ. వ. | ద్వి. వ. | బ. వ. | ఏ. వ. అ. |
|---|---|---|---|---|
| 1. | सः<br>సః | तौ<br>తౌ | ते<br>తే | అతడు |
| 2. | तं<br>తం | तौ<br>తౌ | तान्<br>తాన్ | అతనిని |
| 3. | तेन<br>తేన | ताभ्यां<br>తాభ్యాం | तैः<br>తైః | అతనిచేత/తో |
| 4. | तस्मै<br>తస్మై | ताभ्यां<br>తాభ్యాం | तेभ्यः<br>తేభ్యః | అతనికొఱకు/కై |
| 5. | तस्मात्<br>తస్మాత్ | ताभ्यां<br>తాభ్యాం | तेभ्यः<br>తేభ్యః | అతనివలన/కంటె |
| 6. | तस्य<br>తస్య | तयोः<br>తయోః | तेषां<br>తేషాం | అతనియొక్క/కి |
| 7. | तस्मिन्<br>తస్మిన్ | तयोः<br>తయోః | तेषु<br>తేషు | అతనియందు |

సూచన :— పై 'తద్' శబ్దము మూడు లింగములోను ఉన్నది. వాటికున్న వ్యత్యాసమును గమనింపుడు.

# दकारान्तः स्त्रीलिंगः 'तद्' शब्दः

## దకారాంతః స్త్రీలింగః 'తద్' శబ్దః

| | ఏ. వ. | ద్వి. వ. | బ. వ. | ఏ. వ. అ. |
|---|---|---|---|---|
| 1. | सा<br>సా | ते<br>తే | ताः<br>తాః | ఆమె |
| 2. | तां<br>తాం | ते<br>తే | ताः<br>తాః | ఆమెను |
| 3. | तया<br>తయా | ताभ्यां<br>తాభ్యాం | ताभिः<br>తాభిః | ఆమెచేత/తో |
| 4. | तस्यै<br>తస్యై | ताभ्यां<br>తాభ్యాం | ताभ्यः<br>తాభ్యః | ఆమెకొఱకు/కై |
| 5. | तस्याः<br>తస్యాః | ताभ्यां<br>తాభ్యాం | ताभ्यः<br>తాభ్యః | ఆమెవలన/కంటె |
| 6. | तस्याः<br>తస్యాః | तयोः<br>తయోః | तासां<br>తాసాం | ఆమెయొక్క/కి |
| 7. | तस्यां<br>తస్యాం | तयोः<br>తయోః | तासु<br>తాసు | ఆమెయందు |

సూచన :— ఈ శబ్దమును కంఠస్థము చేయవలెను.



# दकारान्त नपुंसकलिंगः 'तद्' शब्दः

## దకారాంత నపుంసకలింగః 'తద్' శబ్దః

| | ఏ. వ. | ద్వి. వ. | బ. వ. | ఏ. వ. అ. |
|---|---|---|---|---|
| 1. | तत्<br>తత్ | ते<br>తే | तानि<br>తాని | అది |
| 2. | तत्<br>తత్ | ते<br>తే | तानि<br>తాని | దానిని |
| 3. | तेन<br>తేన | ताभ्यां<br>తాభ్యాం | तैः<br>తైః | దానిచేత/తో |
| 4. | तस्मै<br>తస్మై | ताभ्यां<br>తాభ్యాం | तेभ्यः<br>తేభ్యః | దానికొఱకు/కై |
| 5. | तस्मात्<br>తస్మాత్ | ताभ्यां<br>తాభ్యాం | तेभ्यः<br>తేభ్యః | దానివలన/కంటె |
| 6. | तस्य<br>తస్య | तयोः<br>తయోః | तेषां<br>తేషాం | దానియొక్క/కి |
| 7. | तस्मिन्<br>తస్మిన్ | तयोः<br>తయోః | तेषु<br>తేషు | దానియందు |

సూచన :— ఈ శబ్దమును కూడా కంఠస్థము చేయవలెను. దీనికి ప్రథమా ద్వితీయా విభక్తుల రూపములు ఒకే విధముగా ఉండును. సందర్భమును బట్టి అర్థమును గ్రహింపవలెను.

# వ్యక్తివాచక సర్వనామములు

ఉత్తమ పురుష ఏకవచనము :—

| | | |
|---|---|---|
| अहं | गच्छामि | |
| అహం | గచ్ఛామి | నేను వెళ్ళుచున్నాను |
| अहं | वदामि | |
| అహం | వదామి | నేను మాటాడుచున్నాను |
| अहं | पठामि | |
| అహం | పఠామి | నేను చదువుచున్నాను |
| अहं | लिखामि | |
| అహం | లిఖామి | నేను వ్రాయుచున్నాను |
| अहं | क्रीडामि | |
| అహం | క్రీడామి | నేను ఆడుచున్నాను |
| अहं | तिष्ठामि | |
| అహం | తిష్ఠామి | నేను నిలుచున్నాను |
| अहं | करोमि | |
| అహం | కరోమి | నేను చేయుచున్నాను |
| अहं | खादामि | |
| అహం | ఖాదామి | నేను తినుచున్నాను |
| अहं | पिबामि | |
| అహం | పిబామి | నేను త్రాగుచున్నాను |
| अहं | भवामि | |
| అహం | భవామి | నేను ఉన్నాను |
| अहं | धावामि | |
| అహం | ధావామి | నేను పరుగిడుచున్నాను |



మధ్యమ పురుష ఏకవచనము :—

| | | |
|---|---|---|
| त्वं | गच्छसि | |
| త్వం | గచ్ఛసి | నీవు వెళ్లుచున్నావు |
| त्वं | वदसि | |
| త్వం | వదసి | నీవు మాటాడుచున్నావు |
| त्वं | पठसि | |
| త్వం | పఠసి | నీవు చదువుచున్నావు |
| त्वं | लिखसि | |
| త్వం | లిఖసి | నీవు వ్రాయుచున్నావు |
| त्वं | क्रीडसि | |
| త్వం | క్రీడసి | నీవు ఆడుచున్నావు |
| त्वं | तिष्ठसि | |
| త్వం | తిష్ఠసి | నీవు నిలుచున్నావు |
| त्वं | करोषि | |
| త్వం | కరోషి | నీవు చేయుచున్నావు |
| त्वं | खादसि | |
| త్వం | ఖాదసి | నీవు తినుచున్నావు |
| त्वं | पिबसि | |
| త్వం | పిబసి | నీవు త్రాగుచున్నావు |
| त्वं | भवसि | |
| త్వం | భవసి | నీవు ఉన్నావు |
| त्वं | धावसि | |
| త్వం | ధావసి | నీవు పరుగిడుచున్నావు |

ప్రథమ పురుష ఏకవచనము :—

| | | |
|---|---|---|
| सः | गच्छति | |
| సః | గచ్ఛతి | అతడు వెళ్ళుచున్నాడు |
| सः | वदति | |
| సః | వదతి | అతడు మాటాడుచున్నాడు |
| सः | पठति | |
| సః | పఠతి | అతడు చదువుచున్నాడు |
| सः | लिखति | |
| సః | లిఖతి | అతడు వ్రాయుచున్నాడు |
| सः | क्रीडति | |
| సః | క్రీడతి | అతడు ఆడుచున్నాడు |
| सः | तिष्ठति | |
| సః | తిష్ఠతి | అతడు నిలుచున్నాడు |
| सः | करोति | |
| సః | కరోతి | అతడు చేయుచున్నాడు |
| सः | खादति | |
| సః | ఖాదతి | అతడు తినుచున్నాడు |
| सः | पिबति | |
| సః | పిబతి | అతడు త్రాగుచున్నాడు |
| सः | भवति | |
| సః | భవతి | అతడు ఉన్నాడు |
| सः | धावति | |
| సః | ధావతి | అతడు పరుగిడుచున్నాడు |

సూచన :— ఈ వాక్యములలో 'ఆమె' అనే అర్థముగల 'సా' అనే పదమును చేర్చియు, 'అది' అనే అర్థము గల 'తత్' అనే పదమును చేర్చియు వాక్యములను రచింపుడు.



ఉత్తమ పురుష ద్వివచనము :—

| | | |
|---|---|---|
| आवां | गच्छावः | |
| ఆవాం | గచ్ఛావః | మేమిద్దరము వెళ్ళుచున్నాము |
| आवां | वदावः | |
| ఆవాం | వదావః | మేమిద్దరము మాటాడుచున్నాము |
| आवां | पठावः | |
| ఆవాం | పఠావః | మేమిద్దరము చదువుచున్నాము |
| आवां | लिखावः | |
| ఆవాం | లిఖావః | మేమిద్దరము వ్రాయుచున్నాము |
| आवां | क्रीडावः | |
| ఆవాం | క్రీడావః | మేమిద్దరము ఆడుచున్నాము |
| आवां | तिष्ठावः | |
| ఆవాం | తిష్ఠావః | మేమిద్దరము నిలుచున్నాము |
| आवां | कुर्वः | |
| ఆవాం | కుర్వః | మేమిద్దరము చేయుచున్నాము |
| आवां | खादावः | |
| ఆవాం | ఖాదావః | మేమిద్దరము తినుచున్నాము |
| आवां | पिबावः | |
| ఆవాం | పిబావః | మేమిద్దరము త్రాగుచున్నాము |
| आवां | भवावः | |
| ఆవాం | భవావః | మేమిద్దరము ఉన్నాము |
| आवां | धावावः | |
| ఆవాం | ధావావః | మేమిద్దరము పరుగిడుచున్నాము |

సూచన :— మేమిద్దరము అనేచోట మనమిద్దరము అని కూడా పై వాక్యములకు అర్థము చెప్పవచ్చును.

మధ్యమ పురుష ద్వివచనము :—

| | | |
|---|---|---|
| युवां | गच्छथः | |
| యువాం | గచ్ఛథః | మీరిద్దరు వెళ్ళుచున్నారు |
| युवां | वदथः | |
| యువాం | వదథః | మీరిద్దరు మాటాడుచున్నారు |
| युवां | पठथः | |
| యువాం | పఠథః | మిరిద్దరు చదువుచున్నారు |
| युवां | लिखथः | |
| యువాం | లిఖథః | మీరిద్దరు వ్రాయుచున్నారు |
| युवां | क्रीडथः | |
| యువాం | క్రీడథః | మీరిద్దరు ఆడుచున్నారు |
| युवां | तिष्ठथः | |
| యువాం | తిష్ఠథః | మీరిద్దరు నిలచుచున్నారు |
| युवां | कुरुथः | |
| యువాం | కురుథః | మీరిద్దరు చేయుచున్నారు |
| युवां | खादथः | |
| యువాం | ఖాదథః | మీరిద్దరు తినుచున్నారు |
| युवां | पिबथः | |
| యువాం | పిబథః | మీరిద్దరు త్రాగుచున్నారు |
| युवां | भवथः | |
| యువాం | భవథః | మీరిద్దరు ఉన్నారు |
| युवां | धावथः | |
| యువాం | ధావథః | మీరిద్దరు పరుగిడుచున్నారు |



ప్రథమ పురుష ద్వివచనము :—

| | | |
|---|---|---|
| तौ | गच्छतः | |
| తౌ | గచ్ఛతః | వారిద్దరు వెళ్ళుచున్నారు |
| तौ | वदतः | |
| తౌ | వదతః | వారిద్దరు మాటాడుచున్నారు |
| तौ | पठतः | |
| తౌ | పఠతః | వారిద్దరు చదువుచున్నారు |
| तौ | लिखतः | |
| తౌ | లిఖతః | వారిద్దరు వ్రాయుచున్నారు |
| तौ | क्रीडतः | |
| తౌ | క్రీడతః | వారిద్దరు ఆడుచున్నారు |
| तौ | तिष्ठतः | |
| తౌ | తిష్ఠతః | వారిద్దరు నిలుచుచున్నారు |
| तौ | कुरुतः | |
| తౌ | కురుతః | వారిద్దరు చేయుచున్నారు |
| तौ | खादतः | |
| తౌ | ఖాదతః | వారిద్దరు తినుచున్నారు |
| तौ | पिबतः | |
| తౌ | పిబతః | వారిద్దరు త్రాగుచున్నారు |
| तौ | भवतः | |
| తౌ | భవతః | వారిద్దరు ఉన్నారు |
| तौ | धावतः | |
| తౌ | ధావతః | వారిద్దరు పరుగిడుచున్నారు |

ఉత్తమ పురుష బహువచనము :—

| | | |
|---|---|---|
| वयं<br>వయం | गच्छामः<br>గచ్ఛామః | మేము వెళ్లుచున్నాము |
| वयं<br>వయం | वदामः<br>వదామః | మేము మాటాడుచున్నాము |
| वयं<br>వయం | पठामः<br>పఠామః | మేము చదువుచున్నాము |
| वयं<br>వయం | लिखामः<br>లిఖామః | మేము వ్రాయుచున్నాము |
| वयं<br>వయం | क्रीडामः<br>క్రీడామః | మేము ఆడుచున్నాము |
| वयं<br>వయం | तिष्ठामः<br>తిష్ఠామః | మేము నిలుచుచున్నాము |
| वयं<br>వయం | कुर्मः<br>కుర్మః | మేము చేయుచున్నాము |
| वयं<br>వయం | खादामः<br>ఖాదామః | మేము తినుచున్నాము |
| वयं<br>వయం | पिबामः<br>పిబామః | మేము త్రాగుచున్నాము |
| वयं<br>వయం | भवामः<br>భవామః | మేము ఉన్నాము |
| वयं<br>వయం | धावामः<br>ధావామః | మేము పరుగిడుచున్నాము |



మధ్యమ పురుష బహువచనము :—

| | | |
|---|---|---|
| यूयं<br>యూయం | गच्छथ<br>గచ్ఛథ | మీరు వెళ్ళుచున్నారు |
| यूयं<br>యూయం | वदथ<br>వదథ | మీరు మాటాడుచున్నారు |
| यूयं<br>యూయం | पठथ<br>పఠథ | మీరు చదువుచున్నారు |
| यूयं<br>యూయం | लिखथ<br>లిఖథ | మీరు వ్రాయుచున్నారు |
| यूयं<br>యూయం | क्रीडथ<br>క్రీడథ | మీరు ఆడుచున్నారు |
| यूयं<br>యూయం | तिष्ठथ<br>తిష్ఠథ | మీరు నిలుచున్నారు |
| यूयं<br>యూయం | कुरुथ<br>కురుథ | మీరు చేయుచున్నారు |
| यूयं<br>యూయం | खादथ<br>ఖాదథ | మీరు తినుచున్నారు |
| यूयं<br>యూయం | पिबथ<br>పిబథ | మీరు త్రాగుచున్నారు |
| यूयं<br>యూయం | भवथ<br>భవథ | మీరు ఉన్నారు |
| यूयं<br>యూయం | धावथ<br>ధావథ | మీరు పరుగిడుచున్నారు |

ప్రథమ పురుష బహువచనము :—

| | | |
|---|---|---|
| ते गच्छन्ति<br>తే గచ్ఛన్తి | | వారు వెళ్ళుచున్నారు |
| ते वदन्ति<br>తే వదన్తి | | వారు మాటాడుచున్నారు |
| ते पठन्ति<br>తే పఠన్తి | | వారు చదువుచున్నారు |
| ते लिखन्ति<br>తే లిఖన్తి | | వారు వ్రాయుచున్నారు |
| ते क्रीडन्ति<br>తే క్రీడన్తి | | వారు ఆడుచున్నారు |
| ते तिष्ठन्ति<br>తే తిష్ఠన్తి | | వారు నిలుచుచున్నారు |
| ते कुर्वन्ति<br>తే కుర్వన్తి | | వారు చేయుచున్నారు |
| ते खादन्ति<br>తే ఖాదన్తి | | వారు తినుచున్నారు |
| ते पिबन्ति<br>తే పిబన్తి | | వారు త్రాగుచున్నారు |
| ते भवन्ति<br>తే భవన్తి | | వారు ఉన్నారు |
| ते धावन्ति<br>తే ధావన్తి | | వారు పరుగిడుచున్నారు |



# ప్రశ్నార్థక సర్వనామములు

## मकारान्तः पुंलिंगः 'किम्' शब्दः

మకారాంతః పుంలింగః 'కిం' శబ్దః

| | ఏ వ. | ద్వి. వ. | బ. వ. | ఏ. వ. అ |
|---|---|---|---|---|
| 1. | कः<br>కః | कौ<br>కౌ | के<br>కే | ఎవడు? |
| 2. | कं<br>కం | कौ<br>కౌ | कान्<br>కాన్ | ఎవనిని? |
| 3. | केन<br>కేన | काभ्यां<br>కాభ్యాం | कैः<br>కైః | ఎవనిచేత/తో |
| 4. | कस्मै<br>కస్మై | काभ्यां<br>కాభ్యాం | केभ्यः<br>కేభ్యః | ఎవనికొఱకు/కై |
| 5. | कस्मात्<br>కస్మాత్ | काभ्यां<br>కాభ్యాం | केभ्यः<br>కేభ్యః | ఎవనివలన/కంటె |
| 6. | कस्य<br>కస్య | कयोः<br>కయోః | केषां<br>కేషాం | ఎవనియొక్క/కి |
| 7. | कस्मिन्<br>కస్మిన్ | कयोः<br>కయోః | केषु<br>కేషు | ఎవనియందు |

# मकारान्तः स्त्रीलिंगः 'किम्' शब्दः

మకారాంతః స్త్రీలింగః 'కిం' శబ్దః

| | ఏ. వ. | ద్వి. వ. | బ. వ. | ఏ. వ. అ. |
|---|---|---|---|---|
| 1. | का<br>కా | के<br>కే | काः<br>కాః | ఎవతె |
| 2. | कां<br>కాం | के<br>కే | काः<br>కాః | ఎవతెను |
| 3. | कया<br>కయా | काभ्यां<br>కాభ్యాం | काभिः<br>కాభిః | ఎవతెచేత/తో |
| 4. | कस्यै<br>కస్యై | काभ्यां<br>కాభ్యాం | काभ्यः<br>కాభ్యః | ఎవతెకొఱకు/కై |
| 5. | कस्याः<br>కస్యాః | काभ्यां<br>కాభ్యాం | काभ्यः<br>కాభ్యః | ఎవతెవలన/కంటె |
| 6. | कस्याः<br>కస్యాః | कयोः<br>కయోః | कासां<br>కాసాం | ఎవతెయొక్క/కు |
| 7. | कस्यां<br>కస్యాం | कयोः<br>కయోః | कासु<br>కాసు | ఎవతెయందు |



# मकारान्त नपुंसकलिंगः 'किम्' शब्दः

మకారాంత నపుంసకలింగః 'కిం' శబ్దః

| | ఏ. వ. | ద్వి. వ. | బ. వ. | ఏ. వ. అర్థము |
|---|---|---|---|---|
| 1. | किम्<br>కిమ్ | के<br>కే | कानि<br>కాని | ఏది |
| 2. | किम्<br>కిమ్ | के<br>కే | कानि<br>కాని | దేనిని |
| 3. | केन<br>కేన | काभ्यां<br>కాభ్యాం | कैः<br>కైః | దేనిచేత/తో |
| 4. | कस्मै<br>కస్మై | काभ्यां<br>కాభ్యాం | केभ्यः<br>కేభ్యః | దేనికొఱకు/కై |
| 5. | कस्मात्<br>కస్మాత్ | काभ्यां<br>కాభ్యాం | केभ्यः<br>కేభ్యః | దేనివలన/కంటె |
| 6. | कस्य<br>కస్య | कयोः<br>కయోః | केषाम्<br>కేషాం | దేనికి/యొక్క |
| 7. | कस्मिन्<br>కస్మిన్ | कयोः<br>కయోః | केषु<br>కేషు | దేనియందు |

గమనిక:— ఈ శబ్దమునకు ప్రథమా ద్వితీయా విభక్తుల యందు రూపములు ఒకే విధముగా ఉండును. సందర్భమును బట్టి అర్థము చెప్పుకోవలెను.

# అనిశ్చితవాచక సర్వనామములు

సంస్కృత భాషలో 'किम्' అనే సర్వనామ శబ్దానికి चित्, चन, अपि అనే ప్రత్యయాలలో ఒకదానిని చేర్చుటవలన కొన్ని అనిశ్చితవాచక సర్వనామ శబ్దాలు ఏర్పడును. ఆ శబ్దాలకు విశేష్యంగా వచ్చే నామవాచకాలకున్న లింగ-విభక్తి-వచనాలే వచ్చును.

| | | | | | | |
|---|---|---|---|---|---|---|
| పుంలింగము : | कः | + | चित् | = | कश्चित् | ఒకానొకడు (పురుషుడు) |
| | కః | + | చిత్ | = | కశ్చిత్ | |
| | कः | + | चन | = | कश्चन | |
| | కః | + | చన | = | కశ్చన | |
| | कः | + | अपि | = | कोऽपि | |
| | కః | + | అపి | = | కోఽపి | |
| స్త్రీలింగము : | का | + | चित् | = | काचित् | ఒకానొకతె (స్త్రీ) |
| | కా | + | చిత్ | = | కాచిత్ | |
| | का | + | चन | = | काचन | |
| | కా | + | చన | = | కాచన | |
| | का | + | अपि | = | कापि | |
| | కా | + | అపి | = | కాపి | |
| నపుంసకలింగము : | किं | + | चित् | = | किञ्चित् | ఒకానొకటి (వస్తువు) |
| | కిం | + | చిత్ | = | కించిత్ | |
| | किं | + | चन | = | किञ्चन | |
| | కిం | + | చన | = | కించన | |
| | किं | + | अपि | = | किमपि | |
| | కిం | + | అపి | = | కిమపి | |

వాక్యాలలో

1. कश्चित् पुरुषः ఒకానొక పురుషుడు
2. काचित् स्त्री ఒకనొక స్త్రీ
3. किञ्चित् वनम् ఒకానొక అడవి

పుంలింగ किं శబ్ద విభక్తులతో కలిసిన चित्, चन, अपि ప్రత్యయాలు

| విభక్తి | ఏ. వ. | ద్వి. వ. | బ. వ. |
|---|---|---|---|
| 1. | कश्चित् కశ్చిత్ | कौचित् కౌచిత్ | केचित् కేచిత్ |
| 2. | कंचित् కంచిత్ | कौचित् కౌచిత్ | कांश्चित् కాంశ్చిత్ |
| 3. | केनचित् కేనచిత్ | काभ्यांचित् కాభ్యాంచిత్ | कैश्चित् కైశ్చిత్ |
| 4 | कस्मैचित् కస్మైచిత్ | काभ्यांचित् కాభ్యాంచిత్ | केभ्यश्चित् కేభ్యశ్చిత్ |
| 5. | कस्माच्चित् కస్మాచ్చిత్ | काभ्यांचित కాభ్యాంచిత్ | केभ्यश्चित కేభ్యశ్చిత్ |
| 6. | कस्यचित् కస్యచిత్ | कयोश्चित् కయోశ్చిత్ | केषांचित् కేషాంచిత్ |
| 7. | कस्मिंश्चित् కస్మింశ్చిత్ | कयोश्चित् కయోశ్చిత్ | केषुचित् కేషుచిత్ |

సూచన: 1. పై విధంగా 'चन' ప్రత్యయమును కలిపితే कश्चन, कौचन, केचन, कंचन మొదలైన శబ్దాలు; अपि కలిపితే कोऽपि, कावपि, केऽपि, कमपि మొదలైన శబ్దాలు పుంలింగంలో ఏర్పడును.

2. స్త్రీలింగ किं శబ్దానికి పై ప్రత్యయాలు కలిపితే काचित्, कांचित्, काश्चित् మొదలైనవి; काचन, केचन, कांचन మొదలైనవి; कापि, केऽपि, का अपि, कामपि మొదలైనవి ఏర్పడును.

3. నపుంసకలింగ किं శబ్దానికి కలిపితే. किंचित्, कानिचित्; किंचन, कानिचन; किमपि, कान्यपि మొదలైన శబ్దాలు ఏర్పడును.

## వర్గీకరించిన కొన్ని శబ్దాలు



### कालः

(కాలః)

### కాలము

क्षणः
క్షణః — క్షణము

मुहूर्तः
ముహూర్తః — ముహూర్తము

अहोरात्रम्
అహోరాత్రం — పగలు-రాత్రి రేయింబవళ్లు

पक्षः
పక్షః — పక్షము

शुक्लपक्षः
శుక్లపక్షః — శుక్ల పక్షము

कृष्णपक्षः
కృష్ణపక్షః — కృష్ణ పక్షము

मासः
మాసః — మాసము

ऋतुः
ఋతుః — ఋతువు

अयनम्
అయనం — అయనము

उत्तरायणम्
ఉత్తరాయణం — ఉత్తరాయణము

दक्षिणायनम्
దక్షిణాయనం — దక్షిణాయనము

वत्सरः
వత్సరః — సంవత్సరము

प्रभातम्, प्रातः
ప్రభాతం, ప్రాతః — ఉదయకాలము (ప్రొద్దున)

सायम्
సాయం — సాయంకాలము

निशा, रात्रिः
నిశా, రాత్రిః — రేయి

अद्य
అద్య — ఇప్పుడు, ఈరోజు

श्वः
శ్వః — రేపు

ह्यः
హ్యః — నిన్న

| | | |
|---|---|---|
| परश्वः | పరశ్వః | ఎల్లుండి |
| उषः | ఉషః | వేకువ జామున |
| अधुना | అధునా | ఇప్పుడు |
| दिवा | దివా | పగలు |
| नक्तम् | నక్తమ్ | రాత్రి |
| दिवसः | దివసః | దివసము |
| तिथिः | తిథిః | తిథి |
| अमावास्या | అమావాస్యా | అమావాస్య |
| पूर्णिमा | పూర్ణిమా | పూర్ణిమా |



# ऋतवः
(ఋతవః)
## ఋతువులు

| | | |
|---|---|---|
| वसन्तः | వసన్తః | వసంత ఋతువు |
| ग्रीष्मः | గ్రీష్మః | గ్రీష్మ ఋతువు |
| निदाघः | నిదాఘః | |
| वर्षाः | వర్షాః | వర్ష ఋతువు |
| प्रावृट् | ప్రావృట్ | |
| शरत् | శరత్ | శరదృతువు |
| हेमन्तः | హేమన్తః | హేమన్త ఋతువు |
| शिशिरः | శిశిరః | శిశిర ఋతువు |

## मासाः
(మాసాః)
## మాసములు

| | | |
|---|---|---|
| चैत्रः | చైత్రః | చైత్రము |
| वैशाखः | వైశాఖః | వైశాఖము |
| ज्येष्ठः | జ్యేష్ఠః | జ్యేష్ఠము |
| आषाढः | ఆషాఢః | ఆషాఢము |
| श्रावणः | శ్రావణః | శ్రావణము |
| भाद्रपदः | భాద్రపదః | భాద్రపదము |
| आश्विनः | ఆశ్వినః | ఆశ్వీజము |
| कार्तिकः | కార్తికః | కార్తికము |
| मार्गशीर्षः | మార్గశీర్షః | మార్గశిరము |
| पौषः | పౌషః | పుష్యము |
| माघः | మాఘః | మాఘము |
| फाल्गुनः | ఫాల్గునః | ఫాల్గునము |

## वासराः
(వాసరాః)
## వారములు

| | | |
|---|---|---|
| भानुवासरः | భానువాసరః | ఆదివారము |
| इन्दुवासरः | ఇందువాసరః | సోమవారము |
| भौमवासरः | భౌమవాసరః | మంగళవారము |
| सौम्यवासरः | సౌమ్యవాసరః | బుధవారము |
| गुरुवासरः | గురువాసరః | గురువారము |
| शुक्रवासरः | శుక్రవాసరః | శుక్రవారము |
| शनिवासरः | శనివాసరః | శనివారము |
| सप्ताहः | సప్తాహః | ఒకవారము (ఏడు రోజులు) |

# दिशः
(దిశః)
## దిక్కులు

| | |
|---|---|
| पूर्वा, प्राची<br>పూర్వా, ప్రాచీ | తూర్పు |
| दक्षिणा, अवाची<br>దక్షిణా, అవాచీ | దక్షిణము |
| पश्चिमा, प्रतीची<br>పశ్చిమా, ప్రతీచీ | పడమర |
| उत्तरा, उदीची<br>ఉత్తరా, ఉదీచీ | ఉత్తరము |
| ऐशानी<br>ఐశానీ | ఈశాన్యమూల |
| आग्नेयी<br>ఆగ్నేయీ | ఆగ్నేయమూల |
| नैर्ऋती<br>నైరృతీ | నైఋతిమూల |
| वायव्या<br>వాయవ్యా | వాయుమూల |

సూచన :— దిగ్వాచక శబ్దాలన్నీ స్త్రీ లింగంలోనే ఉంటాయి.



# नवग्रहाः
(నవగ్రహాః)
## నవగ్రహాలు

| | |
|---|---|
| सूर्यः<br>సూర్యః | సూర్యుడు |
| चन्द्रः<br>చంద్రః | చంద్రుడు |
| कुजः<br>కుజః | కుజుడు |
| बुधः<br>బుధః | బుధుడు |
| गुरुः<br>గురుః | గురువు |
| शुक्रः<br>శుక్రః | శుక్రుడు |
| शनिः<br>శనిః | శని |
| राहुः<br>రాహుః | రాహువు |
| केतुः<br>కేతుః | కేతువు |

# वर्णाः
(వర్ణాః)

## రంగులు

| | |
|---|---|
| शुक्लः<br>శుక్లః | తెలుపు |
| नीलः<br>నీలః | నలుపు |
| पीतः<br>పీతః | పసుపు |
| रक्तः<br>రక్తః | ఎఱుపు |
| हरितः<br>హరితః | పచ్చ |
| कपिशः<br>కపిశః | గోధుమరంగు |
| धूसरः<br>ధూసరః | బూడిదరంగు |
| शोणः<br>శోణః | చిక్కని ఎఱుపు |
| अरुणः<br>అరుణః | కొంచెము ఎఱుపు |
| पाटलः<br>పాటలః | తెలుపు మించిన ఎఱుపు |



# रसाः
(రసాః)

## రసములు

| | |
|---|---|
| मधुरः<br>మధురః | తీపి |
| आम्लः<br>ఆమ్లః | పులుపు |
| लवणः<br>లవణః | ఉప్పు |
| कटुः<br>కటుః | కారము |
| कषायः<br>కషాయః | చేదు |
| तिक्तः<br>తిక్తః | వగరు |

आम्रस्य रसः मधुरः
ఆమ్రస్య రసః మధురః
మామిడిపండు యొక్క రసము తీయనిది

तिन्त्रिण्याः रसः आम्लः
తింత్రిణ్యాః రసః ఆమ్లః
చింతపండు యొక్క రసము పులుపు

# बान्धवाः

(బాంధవాః)

## బంధువులు

| | | |
|---|---|---|
| माता | మాతా | తల్లి |
| पिता | పితా | తండ్రి |
| मातामहः | మాతామహః | తల్లికి తండ్రి (తాత) |
| पितामहः | పితామహః | తండ్రికి తండ్రి (తాత) |
| मातामही | మాతామహీ | తల్లికి తల్లి (అమ్మమ్మ) |
| पितामही | పితామహీ | తండ్రికి తల్లి (నాన్నమ్మ) |
| पतिः, भर्ता | పతిః, భర్తా | భర్త |
| पत्नी, भार्या | పత్నీ, భార్యా | భార్య |
| पुत्रः, सुतः | పుత్రః, సుతః | కుమారుడు |



| | | |
|---|---|---|
| पुत्री, सुता | పుత్రీ, సుతా | కుమార్తె |
| शिशुः | శిశుః | బిడ్డ |
| ज्येष्ठभ्राता | జ్యేష్ఠ భ్రాతా | అన్న |
| ज्येष्ठभगिनी | జ్యేష్ఠ భగినీ | అక్క |
| कनिष्ठभ्राता | కనిష్ఠ భ్రాతా | తమ్ముడు |
| कनिष्ठभगिनी | కనిష్ఠ భగినీ | చెల్లెలు |
| मातुलः | మాతులః | మేనమామ |
| मातुलानी | మాతులానీ | మేనత్త |
| पितृव्यः | పితృవ్యః | పినతండ్రి, పెదతండ్రి |
| पितृष्वसा | పితృష్వసా | మేనత్త |
| श्वश्रूः | శ్వశ్రూః | అత్త |

| | |
|---|---|
| श्वशुरः<br>శ్వశురః | మామ |
| श्यालः<br>శ్యాలః | బావమరది |
| ननान्दा<br>ననాన్దా | ఆడపడుచు |
| देवरः<br>దేవరః | భర్త తమ్ముడు |
| पौत्रः<br>పౌత్రః | పుత్రుని కొడుకు |
| पौत्री<br>పౌత్రీ | పుత్రుని కూతురు |
| दौहित्रः<br>దౌహిత్రః | కుమార్తె యొక్క కుమారుడు |
| दौहित्री<br>దౌహిత్రీ | కుమార్తె యొక్క కూతురు |
| भागिनेयः<br>భాగినేయః | మేనల్లుడు (సోదరి కొడుకు) |
| भगिनी<br>భగినీ | సోదరి |
| भ्राता<br>భ్రాతా | సోదరుడు |



# मनोभावाः

(మనోభావాః)

## మనోభావములు

| | |
|---|---|
| आनन्दः<br>ఆనందః | ఆనందము |
| कोपः<br>కోపః | కోపము |
| हासः<br>హాసః | నవ్వు |
| रोदनम्<br>రోదనం | ఏడుపు |
| दुःखम्<br>దుఃఖమ్ | దుఃఖము |
| दया<br>దయా | దయ |
| विस्मयः<br>విస్మయః | ఆశ్చర్యము |
| भयम्<br>భయమ్ | భయము |

| | |
|---|---|
| गर्वः<br>గర్వః | గర్వము |
| लज्जा<br>లజ్జా | సిగ్గు |
| क्षान्तिः<br>క్షాన్తిః | ఓర్పు |
| असूया<br>అసూయా | అసూయ |
| कामः<br>కామః | ఆశ |
| प्रेम<br>ప్రేమ | ప్రేమ |
| इच्छा<br>ఇచ్ఛా | కోరిక |
| चिन्ता<br>చిన్తా | చింత (విచారము) |
| उत्कण्ठा<br>ఉత్కణ్ఠా | ఆతురత |
| उत्साहः<br>ఉత్సాహః | ఉత్సాహము |



# मृगाः
## (మృగాః)
## మృగములు

| | |
|---|---|
| सिंहः<br>సింహః | సింహము |
| व्याघ्रः<br>వ్యాఘ్రః | పులి |
| वराहः<br>వరాహః | పంది |
| वानरः<br>వానరః | కోతి |
| भल्लूकः<br>భల్లూకః | ఎలుగుబంటు |
| महिषः<br>మహిషః | ఎనుబోతు |
| सृगालः<br>సృగాలః | నక్క |

| | | |
|---|---|---|
| बिडालः | బిడాలః | పిల్లి |
| वृकः | వృకః | తోడేలు |
| हरिणः | హరిణః | జింక |
| शशः | శశః | కుందేలు |
| गजः | గజః | ఏనుగు |
| अश्वः | అశ్వః | గుఱ్ఱము |
| वृषभः | వృషభః | ఎద్దు |
| सारमेयः | సారమేయః | కుక్క |
| धेनुः | ధేనుః | ఆవు |



| | | |
|---|---|---|
| गौः | గౌః | ఆవు |
| उष्ट्रः | ఉష్ట్రః | ఒంటె |
| गर्दभः | గర్దభః | గాడిద |
| अजः | అజః | మేక |
| वत्सः | వత్సః | దూడ |
| कासरः | కాసరః | (దున్న) అడవి దున్న |
| तुलायः | తులాయః | ఎనుబోతు |
| महिषी | మహిషీ | గేదె |

# खगाः

(ఖగాః)

## పక్షులు - కీటకములు

| | |
|---|---|
| कोकिलः, पिकः<br>కోకిలః, పికః | కోయిల |
| कपोतः<br>కపోతః | పావురము |
| उलूकः<br>ఉలూకః | గ్రుడ్లు గూబ |
| कुक्कुटः<br>కుక్కుటః | కోడి |
| चटकः<br>చటకః | పిచ్చుక |
| काकः<br>కాకః | కాకి |
| गृध्रः<br>గృధ్రః | గ్రద్ద |



| | |
|---|---|
| शुकः<br>శుకః | చిలుక |
| बकः<br>బకః | కొంగ |
| गरुडः<br>గరుడః | గరుడపక్షి |
| मयूरः<br>మయూరః | నెమలి |
| हंसः<br>హంసః | హంసము |
| मधुपः<br>మధుపః | తుమ్మెద |
| सरघा<br>సరఘా | తేనెటీగ |
| मक्षिका<br>మక్షికా | ఈగ |
| मशकः<br>మశకః | దోమ |
| मत्कुणः<br>మత్కుణః | నల్లి |

# शरीरस्य भागाः

(శరీరస్య భాగాః)

## శరీర భాగములు

| | |
|---|---|
| शरीरम्<br>శరీరమ్ | శరీరము |
| शिरः<br>శిరః | తల |
| वदनं<br>వదనం | ముఖము, నోరు |
| कण्ठः<br>కంఠః | గొంతు, మెడ |
| करः<br>కరః | చేయి |
| भुजः<br>భుజః | భుజము |
| वक्षः<br>వక్షః | రొమ్ము |
| उदरं<br>ఉదరం | కడుపు |
| नाभिः<br>నాభిః | బొడ్డు |



| | |
|---|---|
| ऊरुः<br>ఊరుః | తొడ |
| जानुः<br>జానుః | మోకాలు |
| अङ्गुष्ठः<br>అంగుష్ఠః | బొటనవ్రేలు |
| तर्जनी<br>తర్జనీ | చూపుడు వ్రేలు |
| मध्यमा<br>మధ్యమా | నడిమివ్రేలు |
| अनामिका<br>అనామికా | ఉంగరపు వ్రేలు |
| कनिष्ठिका<br>కనిష్ఠికా | చిటికెనవ్రేలు |
| पादः<br>పాదః | పాదము |
| नेत्रम्<br>నేత్రం | కన్ను |
| कर्णः<br>కర్ణః | చెవి |

| | | |
|---|---|---|
| नासिका, नासा | నాసికా, నాసా | ముక్కు |
| मुखम् | ముఖమ్ | ముఖము |
| जिह्वा | జిహ్వా | నాలుక |
| रसना | రసనా | నాలుక |
| दन्तः | దన్తః | పల్లు |
| अंगुली | అంగులీ | వ్రేలు |
| नखः | నఖః | గోరు |
| केशः | కేశః | వెంట్రుక |
| भ्रूः | భ్రూః | కనుబొమ్మ |
| ललाटम् | లలాటమ్ | నుదురు |

'వక్షః' అనునది అకారాంత శబ్దము కాదు. సకారాంత శబ్దము-వక్షః వక్షసీ వక్షాంసి—అని సకరాంత నపుంసకలింగ శబ్దముగా గ్రహించవలెను. ఇట్లే శిరః శిరసీ శిరాంసి- అని చెప్పుకోవలెను.



# भूषणानि
## (భూషణాని)
## నగలు

| | | |
|---|---|---|
| भूषणम् | భూషణం | ఆభరణము |
| किरीटम् | కిరీటమ్ | కిరీటము |
| चूडामणिः | చూడామణిః | శిరోరత్నము |
| कर्णिका, कुण्डलम् | కర్ణికా, కుండలం | అంటుపోగు |
| हारः | హారః | హారము |
| एकावलिः | ఏకావళిః | ముత్యపుమాల |
| मेखला, काञ्ची | మేఖలా, కాంచీ | ఒడ్డాణము |
| कंकणम् | కంకణం | కడియము |
| अङ्गदः | అంగదః | అంగదము, భుజకీర్తి |
| नूपुरम् | నూపురమ్ | కాలిగజ్జె (అందె) |

# वसनानि – प्रसाधनानि च

(వసనాని - ప్రసాధనాని చ)

## వస్త్రములు-అలంకార సాధనములు

| | |
|---|---|
| वस्त्रम् <br> వస్త్రమ్ | వస్త్రము |
| क्षौमम् <br> క్షౌమమ్ | పట్టు వస్త్రము |
| कर्पटः <br> కర్పటః | చినుగు గుడ్డ |
| कम्बलः <br> కంబళః | కంబళి |
| आहतम् <br> ఆహతమ్ | ఉతికినది |
| अनाहतम् <br> అనాహతమ్ | ఉతకనిది |
| दर्पणः <br> దర్పణః | అద్దము |
| प्रसाधनी <br> ప్రసాధనీ | దువ్వెన |
| व्यजनम् <br> వ్యజనమ్ | విసనకఱ్ఱ |
| कञ्चुकः <br> కంచుకః | చొక్కా, రవిక |



# विकलांगाः

(వికలాంగాః)

## అంగహీనులు

| | |
|---|---|
| अन्धः <br> అంధః | గ్రుడ్డివాడు |
| बधिरः <br> బధిరః | చెవిటివాడు |
| विग्रः, विनसः <br> విగ్రః, వినసః | ముక్కిడి |
| कुब्जः <br> కుబ్జః | గూనివాడు |
| पंगुः <br> పంగుః | కుంటివాడు |
| खर्वः <br> ఖర్వః | పొట్టివాడు |
| मूकः <br> మూకః | మూగవాడు |

# वृत्तिकराः

(వృత్తికరాః)

## వృత్తులు చేయువారు

| | |
|---|---|
| तक्षकः<br>తక్షకః | వడ్రంగి |
| रजकः<br>రజకః | చాకలి |
| नापितः<br>నాపితః | మంగలి |
| स्वर्णकारः<br>స్వర్ణకారః | అగసాలె (కమసాలి) |
| लोहकारः<br>లోహకారః | కమ్మరి |
| तन्तुवायः<br>తంతువాయః | సాలె |
| सौचिकः<br>సౌచికః | దర్జీ |
| कुलालः<br>కులాలః | కుమ్మరి |



| | |
|---|---|
| मालाकारः<br>మాలాకారః | తండలల్లువాడు |
| चित्रकारः<br>చిత్రకారః | చిత్రకారుడు |
| चर्मकारः<br>చర్మకారః | మాదిగ |
| नटः<br>నటః | నటుడు |
| व्याधः<br>వ్యాధః | బోయ |
| वैतनिकः<br>వైతనికః | జీతగాడు |
| वार्तावहः<br>వార్తావహః | వార్తలు తెలుపువాడు |
| चोरः<br>చోరః | దొంగ |
| किंकरः, सेवकः<br>కింకరః, సేవకః | సేవకుడు |

# नवधान्यानि

[నవధాన్యాని]

## న వ ధా న్య ము లు

| | |
|---|---|
| गो धू मः<br>గో ధూ మః | గోధుమ |
| व्री हिः<br>వ్రీ హిః | వరిధాన్యము |
| आ ढ कः<br>ఆ ఢ కః | కందులు |
| मु द्गः<br>ము ద్గః | పెసలు |
| च ण कः<br>చ ణ కః | సెనగలు |
| ति ल म्<br>తి ల మ్ | నువ్వులు |
| मा षः<br>మా షః | మినుములు |
| कु लु त्थः<br>కు ళు త్థః | ఉలవలు |
| रा ज मा षः<br>రా జ మా షః | అలచందలు |



# फलानि

(ఫలాని)

## ప ం డ్లు

| | |
|---|---|
| आ म्र<br>ఆ మ్రం | మామిడిపండు |
| प न सं<br>ప న సం | పనసపండు |
| ना रि के लं<br>నా రి కే లం | టెంకాయ |
| द्रा क्षा<br>ద్రా క్ష | ద్రాక్ష |
| ज म्बी र म्<br>జ ంబీ ర మ్ | నిమ్మ |
| क पि त्थं<br>క పి త్థం | వెలగ |
| क द ली<br>క ద లీ. | అరటి |
| ज म्बूः<br>జ ంబూః | నేరేడు |
| आ म ल क म्<br>ఆ మ ల క ం | ఉసిరిక |
| ब द रं<br>బ ద రం | రేగుపండు |

# लोहाः, खनिजाः च

(లోహాః, ఖనిజాః చ)

## లోహములు, ఖనిజములు

| | |
|---|---|
| सुवर्णं<br>సువర్ణం | బంగారు |
| रजतं<br>రజతం | వెండి |
| पित्तलं<br>పిత్తలం | ఇత్తడి |
| ताम्रं<br>తామ్రం | రాగి |
| अयः<br>అయః | ఇనుము |
| सीसं<br>సీసం | సీసము |
| कांस्यं<br>కాంస్యం | కంచు |
| त्रपु<br>త్రపు | తగరము |
| पारदः<br>పారదః | పాదరసము |
| अभ्रकं<br>అభ్రకం | అభ్రకము |

# संख्यावाचकानि

(సంఖ్యావాచకాని)

## సంఖ్యావాచకములు

| పుం. | స్త్రీ. | నపుం. | |
|---|---|---|---|
| एकः<br>ఏకః | एका<br>ఏకా | एकं<br>ఏకం | १<br>ఒకటి |
| द्वौ<br>ద్వౌ | द्वे<br>ద్వే | द्वे<br>ద్వే | २<br>రెండు |
| त्रयः<br>త్రయః | तिस्रः<br>తిస్రః | त्रीणि<br>త్రీణి | ३<br>మూడు |
| चत्वारः<br>చత్వారః | चतस्रः<br>చతస్రః | चत्वारि<br>చత్వారి | ४<br>నాలుగు |
| पञ्च<br>పఞ్చ | | | ५<br>ఐదు |
| षट्<br>షట్ | | | ६<br>ఆరు |
| सप्त<br>సప్త | | | ७<br>ఏడు |
| अष्ट - अष्टौ<br>అష్ట/అష్టౌ | | | ८<br>ఎనిమిది |
| नव<br>నవ | | | ९<br>తొమ్మిది |
| दश<br>దశ | | | १०<br>పది |

సూచన :— ఒకటి మొదలు నాలుగు వరకున్న శబ్దాలు మూడు లింగాలలోను వచ్చును.

| | |
|---|---|
| एकादश<br>ఏకాదశ | ११<br>పదునొకండు |
| द्वादश<br>ద్వాదశ | १२<br>పండ్రెండు |
| त्रयोदश<br>త్రయోదశ | १३<br>పదమూడు |
| चतुर्दश<br>చతుర్దశ | १४<br>పదునాల్గు |
| पञ्चदश<br>పంచదశ | १५<br>పదునైదు |
| षोडश<br>షోడశ | १६<br>పదునారు |
| सप्तदश<br>సప్తదశ | १७<br>పదునేడు |
| अष्टादश<br>అష్టాదశ | १८<br>పదునెనిమిది |
| नवदश<br>నవదశ | १९<br>పందొమ్మిది |
| विंशतिः<br>వింశతిః | २०<br>ఇరవై |

* ఇరువది, దానికి పైబడిన సంఖ్యలు ఇవన్నీ ఎప్పుడూ ఏక వచనం గానే వుంటాయి.



| | |
|---|---|
| त्रिंशत्<br>త్రింశత్ | ३०<br>ముప్పై |
| चत्वारिंशत्<br>చత్వారింశత్ | ४०<br>నలభై |
| पञ्चाशत्<br>పంచాశత్ | ५०<br>యాభై |
| षष्टिः<br>షష్టిః | ६०<br>అరవై |
| सप्ततिः<br>సప్తతిః | ७०<br>డెబ్బై |
| अशीतिः<br>అశీతిః | ८०<br>ఎనభై |
| नवतिः<br>నవతిః | ९०<br>తొంభై |
| शतम्<br>శతమ్ | १००<br>నూరు |
| सहस्रम्<br>సహస్రమ్ | १०००<br>వేయి |
| लक्षम्<br>లక్షమ్ | १,००,०००<br>లక్ష |
| कोटिः<br>కోటిః | १०००००००<br>కోటి |

# संख्येयवाचकानि

(సంఖ్యేయవాచకాని)

## సంఖ్యేయములు

| పుం. | స్త్రీ. | నపుం. | |
|---|---|---|---|
| प्रथमः | प्रथमा | प्रथमं | |
| ప్రథమః | ప్రథమా | ప్రథమం | 1-వ |
| द्वितीयः | द्वितीया | द्वितीयम् | |
| ద్వితీయః | ద్వితీయా | ద్వితీయం | 2-వ |
| तृतीयः | तृतीया | तृतीयम् | |
| తృతీయః | తృతీయా | తృతీయం | 3-వ |
| चतुर्थः | चतुर्थी | चतुर्थम् | |
| చతుర్థః | చతుర్థీ | చతుర్థం | 4-వ |
| पञ्चमः | पञ्चमी | पञ्चमम् | |
| పంచమః | పంచమీ | పంచమమ్ | 5-వ |
| षष्ठः | षष्ठी | षष्ठम् | |
| షష్ఠః | షష్ఠీ | షష్ఠమ్ | 6-వ |
| सप्तमः | सप्तमी | सप्तमम् | |
| సప్తమః | సప్తమీ | సప్తమమ్ | 7-వ |
| अष्टमः | अष्टमी | अष्टमम् | |
| అష్టమః | అష్టమీ | అష్టమమ్ | 8-వ |
| नवमः | नवमी | नवमम् | |
| నవమః | నవమీ | నవమమ్ | 9-వ |
| दशमः | दशमी | दशमम् | |
| దశమః | దశమీ | దశమమ్ | 10-వ |



| | | | |
|---|---|---|---|
| एकादशः | एकादशी | एकादशम् | |
| ఏకాదశః | ఏకాదశీ | ఏకాదశమ్ | 11-వ |
| द्वादशः | द्वादशी | द्वादशम् | |
| ద్వాదశః | ద్వాదశీ | ద్వాదశమ్ | 12-వ |
| त्रयोदशः | त्रयोदशी | त्रयोदशम् | |
| త్రయోదశః | త్రయోదశీ | త్రయోదశమ్ | 13-వ |
| चतुर्दशः | चतुर्दशी | चतुर्दशम् | |
| చతుర్దశః | చతుర్దశీ | చతుర్దశమ్ | 14-వ |
| पञ्चदशः | पञ्चदशी | पञ्चदशम् | |
| పంచదశః | పంచదశీ | పంచదశమ్ | 15-వ |
| षोडशः | षोडशी | षोडशम् | |
| షోడశః | షోడశీ | షోడశమ్ | 16-వ |
| सप्तदशः | सप्तदशी | सप्तदशम् | |
| సప్తదశః | సప్తదశీ | సప్తదశమ్ | 17-వ |
| अष्टादशः | अष्टादशी | अष्टादशम् | |
| అష్టాదశః | అష్టాదశీ | అష్టాదశమ్ | 18-వ |
| नवदशः | नवदशी | नवदशम् | |
| నవదశః | నవదశీ | నవదశమ్ | 19-వ |
| विंशः | विंशी | त्रिंशम् | |
| వింశః | వింశీ | వింశమ్ | 20-వ |

| | | | |
|---|---|---|---|
| त्रिंशः<br>త్రింశః | त्रिंशी<br>త్రింశీ | त्रिंशम्<br>త్రింశమ్ | 30-వ |
| चत्वारिंशः<br>చత్వారింశః | चत्वारिंशी<br>చత్వారింశీ | चत्वारिंशम्<br>చత్వారింశమ్ | 40-వ |
| पंचाशः<br>పంచాశః | पंचाशी<br>పంచాశీ | पंचाशम्<br>పంచాశమ్ | 50-వ |
| षष्टितमः<br>షష్టితమః | षष्टितमी<br>షష్టితమీ | षष्टितमम्<br>షష్టితమమ్ | 60-వ |
| सप्ततितमः<br>సప్తతితమః | सप्ततितमी<br>సప్తతితమీ | सप्ततितमम्<br>సప్తతితమమ్ | 70-వ |
| अशीतितमः<br>అశీతితమః | अशीतितमी<br>అశీతితమీ | अशीतितमम्<br>అశీతితమమ్ | 80-వ |
| नवतितमः<br>నవతితమః | नवतितमी<br>నవతితమీ | नवतितमम्<br>నవతితమమ్ | 90-వ |
| शततमः<br>శతతమః | शततमी<br>శతతమీ | शततमम्<br>శతతమమ్ | 100-వ |



| | |
|---|---|
| पादम्<br>పాదం | పాతిక |
| अर्धम्<br>అర్ధమ్ | సగము |
| पादोनम्<br>పాదోనమ్ | ముప్పాతిక |
| सपादैकम्<br>సపాదైకమ్ | ఒకటింపావు |
| सार्धैकम्<br>సార్ధైకమ్ | ఒకటిన్నర |
| पादोनद्वयम्<br>పాదోనద్వయమ్ | ఒకటిముప్పావు |
| सपादद्वयम्<br>సపాదద్వయం | రెండుంపాతిక |
| सार्धद्वयम्<br>సార్ధద్వయం | రెండున్నర |
| पदोनत्रयम्<br>పాదోనత్రయం | రెండుముప్పావు |

# ధాతువులు-క్రియలు

ఒక చెట్టులోని కొమ్మలు, ఆకులు, ఫలములు ఇవన్నీ ఎట్లు ఆ చెట్టు కున్న వేరును (మూలాన్ని) ఆధారంగా చేసుకొని పుడుతాయో, అలాగే ఒక భాషలోని నామవాచకములు, క్రియా పదములు, క్రియా విశేషణములు, అవ్యయములు ఈలాటి భాషా భాగాలన్నీ ఒక మూల ధాతువు నుంచే రూపొందుతాయి.

సంస్కృత భాషలో ఇంచుమించు 2200 మూల ధాతువులున్నాయి. ఆ ధాతువుల నుంచే అతి విపులమైన సంస్కృత భాషా వాఙ్మయమంతా రూపొందింది.

ఈ ధాతువులు పది వర్గలుగా విభజింపబడ్డాయి. ఆ వర్గలను 'వికరణములు' అని చెబుదురు. ప్రతి వర్గకు ఒక వికరణ చిహ్నం ఉంటుంది. ఆ విషయం ప్రస్తుతం అవసరంలేదు.

ఈ పుస్తకంలో నిత్య జీవితానికి అవసరమైన, ప్రసిద్ధమైన కొన్ని ధాతువులను గురించిన వివరాలను ముందు పేజీలలో చూడవచ్చు. ఈ క్రియలను బాగా అర్థం చేసుకొని కంఠస్థం చేస్తే, తృప్తికరంగా క్రియా పదాలను ప్రయోగించి వాక్యపూర్తి చేసుకోవచ్చు.

## సంస్కృత ధాతువులు - వాటి విభాగములు

సంస్కృత ధాతువులు కొన్ని పరస్మై పదులవి. కొన్ని ఆత్మనే పదులవి. కొన్ని రెండూ కలిసిన ఉభయ పదులవీ మూడు రకాలుగా విభజించబడి ఉన్నాయి. ఆయా పదులలోని ప్రత్యయాల స్వరూపం వేరు వేరుగా ఉంటుంది.



క్రియలు ఒక్కొక్కటీ ఈ క్రింద వివరించిన రీతిగా భూత - భవిష్యద్ - వర్తమాన కాలాలను తెలుపుతుంటాయి. :—

| వ.నెం. | సంస్కృతములోని పేరు | తెలుగులో | కాలము |
|---|---|---|---|
| 1. | लट् | లట్ | వర్తమానకాలము |
| 2. | लङ् | లఙ్ | భూతకాలము |
| 3 | लुङ् | లుఙ్ | భూతకాలము |
| 4. | लिट् | లిట్ | భూతకాలము |
| 5. | लुट् | లుట్ | భవిష్యత్ కాలము |
| 6. | लृट् | లృట్ | భవిష్యత్ కాలము |
| 7. | लृङ् | లృఙ్ | భవిష్యత్ కాలము |
| 8. | विधिलिङ् | విధిలిఙ్ | విధి (ప్రేరణ) |
| 9. | आशीलिङ् | ఆశీర్లిఙ్ | దీవింపు |
| 10.. | लोट् | లోట్ | ఆశీర్వాదము, విధి |

గమనిక : ముందున్న పేజీలలో కొన్ని ధాతువులకు లట్, లఙ్, లృట్, లోట్ అనే 4 లకారాల రూపాలన్నీ ఇవ్వబడ్డాయి. అదే విధంగా తతిమ్మా ధాతువులకు కూడా రూపాలను ఊహించి ప్రయోగించవలెను.

## పరస్మైపది ధాతువు

# गम् (गच्छ्) = వెళ్లు

### వర్తమానకాలము — లట్

| | ఏ. వ. | ద్వి. వ. | బ. వ. |
|---|---|---|---|
| ప్ర. పు. | गच्छति<br>గచ్ఛతి<br>అతడు వెళ్ళుచున్నాడు | गच्छतः<br>గచ్ఛతః<br>వారిద్దరు వెళ్ళుచున్నారు | गच्छन्ति<br>గచ్ఛన్తి<br>వారు వెళ్లుచున్నారు |
| మ. పు. | गच्छसि<br>గచ్ఛసి<br>నీవు వెళ్ళుచున్నావు | गच्छथः<br>గచ్ఛథః<br>మీరిద్దరు వెళ్ళుచున్నారు | गच्छथ<br>గచ్ఛథ<br>మీరు వెళ్ళుచున్నారు |
| ఉ. పు. | गच्छामि<br>గచ్ఛామి<br>నేను వెళ్లుచున్నాను | गच्छावः<br>గచ్ఛావః<br>మేమిద్దరం వెళ్లుచున్నాము | गच्छामः<br>గచ్ఛామః<br>మేము వెళ్లుచున్నాము |

### భూత కాలము - లజ్

| | | | |
|---|---|---|---|
| ప్ర. పు. | अगच्छत्<br>అగచ్ఛత్<br>అతడు వెళ్ళెను | अगच्छतां<br>అగచ్ఛతాం<br>వారిద్దరు వెళ్ళిరి | अगच्छन्<br>అగచ్ఛన్<br>వారు వెళ్ళిరి |
| మ. పు. | अगच्छः<br>అగచ్ఛః<br>నీవు వెళ్ళితివి | अगच्छतं<br>అగచ్ఛతం<br>మీరిద్దరు వెళ్ళితిరి | अगच्छत<br>అగచ్ఛత<br>మీరు వెళ్ళితిరి |
| ఉ. పు. | अगच्छम्<br>అగచ్ఛం<br>నేను వెళ్ళితివి | अगच्छाव<br>అగచ్ఛావ<br>మేముద్దము వెళ్ళితిమి | अगच्छाम<br>అగచ్ఛామ<br>మేము వెళ్ళితిమి |



### భవిష్యత్కాలము - లృట్

| | | | |
|---|---|---|---|
| ప్ర. పు. | गमिष्यति<br>గమిష్యతి<br>అతడు వెళ్ళగలడు | गमिष्यतः<br>గమిష్యతః<br>వారిద్దరు వెళ్ళగలరు | गमिष्यन्ति<br>గమిష్యన్తి<br>వారు వెళ్ళగలరు |
| మ. పు. | गमिष्यसि<br>గమిష్యసి<br>నీవు వెళ్ళగలవు | गमिष्यथः<br>గమిష్యథః<br>మీరిద్దరు వెళ్ళగలరు | गमिष्यथ<br>గమిష్యథ<br>మీరు వెళ్ళగలరు |
| ఉ. పు. | गमिष्यामि<br>గమిష్యామి<br>నేను వెళ్ళగలను | गमिष्यावः<br>గమిష్యావః<br>మేమిద్దరము వెళ్ళగలము | गमिष्यामः<br>గమిష్యామః<br>మేము వెళ్ళగలము |

### విధి, ఆశీర్వాదము - లోట్

| | | | |
|---|---|---|---|
| ప్ర. పు. | गच्छतु, गच्छतात्<br>గచ్ఛతు, గచ్ఛతాత్<br>అతను వెళ్ళుగాక | गच्छतां<br>గచ్ఛతాం<br>వారిద్దరు వెళ్ళుగాక | गच्छन्तु<br>గచ్ఛన్తు<br>వారు వెళ్లుదురుగాక |
| మ. పు. | गच्छ, गच्छतात्<br>గచ్ఛ, గచ్ఛతాత్<br>నీవు వెళ్ళుదువుగాక | गच्छतं<br>గచ్ఛతం<br>మీరిద్దరు వెళ్ళుదురుగాక | गच्छत<br>గచ్ఛత<br>మీరు వెళ్ళుదురుగాక |
| ఉ. పు. | गच्छानि<br>గచ్ఛాని<br>నేను వెళ్ళుదునుగాక | गच्छाव<br>గచ్ఛావ<br>మేమిద్దరము వెళ్ళెదముగాక | गच्छाम<br>గచ్ఛామ<br>మేము వెళ్ళెదముగాక |

# स् (అస్) = ఉండు

## వర్తమానకాలము—లట్

| | | | |
|---|---|---|---|
| ప్ర.పు. | अस्ति<br>అస్తి<br>అతడు ఉన్నాడు | स्तः<br>స్తః<br>వారిద్దరు ఉన్నారు | सन्ति<br>సన్తి<br>వారు ఉన్నారు |
| మ.పు. | असि<br>అసి<br>నీవు ఉన్నావు | स्थः<br>స్థః<br>మీరిద్దరు ఉన్నారు | स्थ<br>స్థ<br>మీరు ఉన్నారు |
| ఉ.పు. | अस्मि<br>అస్మి<br>నేను ఉన్నాను | स्वः<br>స్వః<br>మేమిద్దరము ఉన్నాము | स्मः<br>స్మః<br>మేము ఉన్నాము |

## భూతకాలము - లఙ్

| | | | |
|---|---|---|---|
| ప్ర.పు. | आसीत्<br>ఆసీత్<br>అతడు ఉండెను | आस्तां<br>ఆస్తాం<br>వారిద్దరు ఉండిరి | आसन्<br>ఆసన్<br>వారు ఉండిరి |
| మ.పు | आसीः<br>ఆసీః<br>నీవు ఉంటివి | आस्तं<br>ఆస్తం<br>మీరిద్దరు ఉంటిరి | आस्त<br>ఆస్త<br>మీరు ఉంటిరి |
| ఉ.పు. | आसं<br>ఆసం<br>నేను ఉంటిని | आस्व<br>ఆస్వ<br>మేమిద్దరము ఉంటిమి | आस्म<br>ఆస్మ<br>మేము ఉంటిమి |



## భవిష్యత్కాలము - లృట్

| | | | |
|---|---|---|---|
| ప్ర.పు. | भविष्यति<br>భవిష్యతి<br>అతడు ఉండగలడు | भविष्यतः<br>భవిష్యతః<br>వారిద్దరు ఉండగలరు | भविष्यन्ति<br>భవిష్యన్తి<br>వారు ఉండగలరు |
| మ.పు. | भविष्यसि<br>భవిష్యసి<br>నీవు ఉండగలవు | भविष्यथः<br>భవిష్యథః<br>మీరిద్దరు ఉండగలరు | भविष्यथ<br>భవిష్యథ<br>మీరు ఉండగలరు |
| ఉ.పు. | भविष्यामि<br>భవిష్యామి<br>నేను ఉండగలను | भविष्यावः<br>భవిష్యావః<br>మేమిద్దరం ఉండగలము | भविष्यामः<br>భవిష్యామః<br>మేము ఉండగలము |

## విధి, ఆశీర్వాదము - లోట్

| | | | |
|---|---|---|---|
| ప్ర.పు. | अस्तु, स्तात्<br>అస్తు, స్తాత్<br>అతడు ఉండుగాక | स्तां<br>స్తాం<br>వారిద్దరు ఉందురుగాక | सन्तु<br>సన్తు<br>వారు ఉందురుగాక |
| మ.పు. | एधि, स्तात्<br>ఏధి, స్తాత్<br>నీవు ఉండువుగాక | स्तं<br>స్తం<br>మీరిద్దరు ఉందురుగాక | स्त<br>స్త<br>మీరు ఉందురుగాక |
| ఉ.పు. | असानि<br>అసాని<br>నేను ఉందునుగాక | असाव<br>అసావ<br>మేమిద్దరం ఉందుముగాక | असाम<br>అసామ<br>మేము ఉందుముగాక |

## ఆత్మనేపది ధాతువు

# वृतु (वर्त्) వృతు (వర్త్) = ఉండు

### వర్తమానకాలము - లట్

| | | | |
|---|---|---|---|
| ప్ర.పు. | वर्तते<br>వర్తతే<br>అతడు ఉన్నాడు | वर्तेते<br>వర్తేతే<br>వారిద్దరు ఉన్నారు | वर्तन्ते<br>వర్తన్తే<br>వారున్నారు |
| మ.పు. | वर्तसे<br>వర్తసే<br>నీవు ఉన్నావు | वर्तेथे<br>వర్తేథే<br>మీరిద్దరు ఉన్నారు | वर्तध्वे<br>వర్తధ్వే<br>మీరు ఉన్నారు |
| ఉ.పు. | वर्ते<br>వర్తే<br>నేను ఉన్నాను | वर्तावहे<br>వర్తావహే<br>మేమిద్దరం ఉన్నాము | वर्तामहे<br>వర్తామహే<br>మేము ఉన్నాము |

### భూతకాలము - లఙ్

| | | | |
|---|---|---|---|
| ప్ర.పు. | अवर्तत<br>అవర్తత<br>అతడు ఉండెను | अवर्तेतां<br>అవర్తేతాం<br>వారిద్దరు ఉండిరి | अवर्तन्त<br>అవర్తన్త<br>వారు ఉండిరి |
| మ.పు. | अवर्तथाः<br>అవర్తథాః<br>నీవు ఉంటివి | अवर्तेथां<br>అవర్తేథాం<br>మీరిద్దరు ఉండిరి | अवर्तध्वम्<br>అవర్తధ్వం<br>మీరు ఉండిరి |
| ఉ.పు. | अवर्ते<br>అవర్తే<br>నేను ఉంటివి | अवर्तावहि<br>అవర్తావహి<br>మేమిద్దరము ఉంటిమి | अवर्तामहि<br>అవర్తామహి<br>మేము ఉంటిమి |



### భవిష్యత్కాలము - లృట్

| | | | |
|---|---|---|---|
| ప్ర.పు. | वर्तिष्यते<br>వర్తిష్యతే<br>అతడు ఉండగలడు | वर्तिष्येते<br>వర్తిష్యేతే<br>వారిద్దరు ఉండగలరు | वर्तिष्यन्ते<br>వర్తిష్యన్తే<br>వారు ఉండగలరు |
| మ.పు. | वर्तिष्यसे<br>వర్తిష్యసే<br>నీవు ఉండగలవు | वर्तिष्येथे<br>వర్తిష్యేథే<br>మీరిద్దరు ఉండగలరు | वर्तिष्यध्वे<br>వర్తిష్యధ్వే<br>మీరు ఉండగలరు |
| ఉ.పు. | वर्तिष्ये<br>వర్తిష్యే<br>నేను ఉండగలను | वर्तिष्यावहे<br>వర్తిష్యావహే<br>మేమిద్దరం ఉండగలము | वर्तिष्यामहे<br>వర్తిష్యామహే<br>మేము ఉండగలము |

### విధి, ఆశీర్వాదము - లోట్

| | | | |
|---|---|---|---|
| ప్ర.పు. | वर्तताम्<br>వర్తతాం<br>అతడు ఉండుగాక | वर्तेतां<br>వర్తేతాం<br>వారిద్దరు ఉందురుగాక | वर्तन्ताम्<br>వర్తన్తాం<br>వారు ఉందురుగాక |
| మ.పు. | वर्तस्व<br>వర్తస్వ<br>నీవు ఉందువుగాక | वर्तेथाम्<br>వర్తేథాం<br>మీరిద్దరు ఉందురుగాక | वर्तध्वम्<br>వర్తధ్వం<br>మీరు ఉందురుగాక |
| ఉ.పు. | वर्तै<br>వర్తై<br>నేను ఉందునుగాక | वर्तावहै<br>వర్తావహై<br>మేమిద్దరము ఉందుముగాక | वर्तामहै<br>వర్తామహై<br>మేము ఉందుముగాక |

## ఉభయపది ధాతువు, (1. పరస్మైపదరూపములు)

# कृ (कर्) కృ (కర్) – చేయు

### వర్తమానకాలము - లట్

| | | | |
|---|---|---|---|
| ప్ర.పు. | करोति<br>కరోతి | कुरुतः<br>కురుతః | कुर्वन्ति<br>కుర్వన్తి |
| | అతడు చేయుచున్నాడు | వారిద్దరు చేయుచున్నారు | వారు చేయుచున్నారు |
| మ.పు. | करोषि<br>కరోషి | कुरुथः<br>కురుథః | कुरुथ<br>కురుథ |
| | నీవు చేయుచున్నావు | మీరిద్దరు చేయుచున్నారు | మీరు చేయుచున్నారు |
| ఉ.పు. | करोमि<br>కరోమి | कुर्वः<br>కుర్వః | कुर्मः<br>కుర్మః |
| | నేను చేయుచున్నాను | మేమిద్దరము చేయుచున్నాము | మేము చేయుచున్నాము |

### భూతకాలము - లఙ్

| | | | |
|---|---|---|---|
| ప్ర.పు. | अकरोत्<br>అకరోత్ | अकुरुताम्<br>అకురుతాం | अकुर्वन्<br>అకుర్వన్ |
| | అతడు చేసెను | వారిద్దరు చేసిరి | వారు చేసిరి |
| మ.పు. | अकरोः<br>అకరోః | अकुरुतम्<br>అకురుతం | अकुरुत<br>అకురుత |
| | నీవు చేసితివి | మీరిద్దరు చేసితిరి | మీరు చేసితిరి |
| ఉ.పు. | अकरवं<br>అకరవం | अकुर्व<br>అకుర్వ | अकुर्म<br>అకుర్మ |
| | నేను చేసితిని | మేమిద్దరము చేసితిమి | మేము చేసితిమి |



### భవిష్యత్కాలము - లృట్

| | | | |
|---|---|---|---|
| ప్ర.పు. | करिष्यति<br>కరిష్యతి | करिष्यतः<br>కరిష్యతః | करिष्यन्ति<br>కరిష్యన్తి |
| | అతడు చేయగలడు | వారిద్దరు చేయగలరు | వారు చేయగలరు |
| మ.పు. | करिष्यसि<br>కరిష్యసి | करिष्यथः<br>కరిష్యథః | करिष्यथ<br>కరిష్యథ |
| | నీవు చేయగలవు | మీరిద్దరు చేయగలరు | మీరు చేయగలరు |
| ఉ.పు. | करिष्यामि<br>కరిష్యామి | करिष्यावः<br>కరిష్యావః | करिष्यामः<br>కరిష్యామః |
| | నేను చేయగలను | మేమిద్దరము చేయగలము | మేము చేయగలము |

### విధి, ఆశీర్వాదము - లోట్

| | | | |
|---|---|---|---|
| ప్ర.పు. | करोतु, कुरुतात्<br>కరోతు, కురుతాత్ | कुरुतां<br>కురుతాం | कुर्वन्तु<br>కుర్వన్తు |
| | అతడు చేయుగాక | వారిద్దరు చేయుదురుగాక | వారు చేయుదురుగాక |
| మ.పు. | कुरु, कुरुतात्<br>కురు,కురుతాత్ | कुरुतम्<br>కురుతం | कुरुत<br>కురుత |
| | నీవు చేసెదవుగాక | మీరిద్దరు చేసెదరుగాక | మీరు చేసెదరుగాక |
| ఉ.పు. | करवाणि<br>కరవాణి | करवाव<br>కరవావ | करवाम<br>కరవామ |
| | నేను చేసెదనుగాక | మేమిద్దరము చేసెదముగాక | మేము చేసెదముగాక |

## 2. ఆత్మనేపదరూపములు

### వర్తమానకాలము - లట్

| | | | |
|---|---|---|---|
| ప్ర.పు. | कुरुते<br>కురుతే | कुर्वाते<br>కుర్వాతే | कुर्वते<br>కుర్వతే |
| | అతడు చేయుచున్నాడు | వారిద్దరు చేయుచున్నారు | వారు చేయుచున్నారు |
| మ.పు. | कुरुषे<br>కురుషే | कुर्वाथे<br>కుర్వాథే | कुरुध्वे<br>కురుధ్వే |
| | నీవు చేయుచున్నావు | మీరిద్దరు చేయుచున్నారు | మీరు చేయుచున్నారు |
| ఉ.పు. | कुर्वे<br>కుర్వే | कुर्वहे<br>కుర్వహే | कुर्महे<br>కుర్మహే |
| | నేను చేయుచున్నాను | మేమిద్దరము చేయుచున్నాము | మేము చేయుచున్నాము |

### భూతకాలము - లఙ్

| | | | |
|---|---|---|---|
| ప్ర.పు. | अकुरुत<br>అకురుత | अकुर्वातां<br>అకుర్వాతాం | अकुर्वत<br>అకుర్వత |
| | అతడు చేసెను | వారిద్దరు చేసిరి | వారు చేసిరి |
| మ.పు. | अकुरुथाः<br>అకురుథాః | अकुर्वाथां<br>అకుర్వాథాం | अकुरुध्वं<br>అకురుధ్వం |
| | నీవు చేసితివి | మీరిద్దరు చేసితిరి | మీరు చేసితిరి |
| ఉ.పు. | अकुर्वि<br>అకుర్వి | अकुर्वहि<br>అకుర్వహి | अकुर्महि<br>అకుర్మహి |
| | నేను చేసితిని | మేమిద్దరము చేసితిమి | మేము చేసితిమి |

### భవిష్యత్కాలము - లృట్

| | | | |
|---|---|---|---|
| ప్ర.పు. | करिष्यते<br>కరిష్యతే | करिष्येते<br>కరిష్యేతే | करिष्यन्ते<br>కరిష్యన్తే |
| | అతడు చేయగలడు | వారిద్దరు చేయగలరు | వారు చేయగలరు |
| మ.పు. | करिष्यसे<br>కరిష్యసే | करिष्येथे<br>కరిష్యేథే | करिष्यध्वे<br>కరిష్యధ్వే |
| | నీవు చేయగలవు | మీరిద్దరు చేయగలరు | మీరు చేయగలరు |
| ఉ.పు. | करिष्ये<br>కరిష్యే | करिष्यावहे<br>కరిష్యావహే | करिष्यामहे<br>కరిష్యామహే |
| | నేను చేయగలను | మేమిద్దరము చేయగలము | మేము చేయగలము |

### విధి, ఆశీర్వాదము - లోట్

| | | | |
|---|---|---|---|
| ప్ర.పు. | कुरुतां<br>కురుతాం | कुर्वातां<br>కుర్వాతాం | कुर्वताम्<br>కుర్వతాం |
| | అతడు చేయుగాక | వారిద్దరు చేయుగాక | వారు చేయుగాక |
| మ.పు. | कुरुष्व<br>కురుష్వ | कुर्वाथां<br>కుర్వాథాం | कुरुध्वम्<br>కురుధ్వం |
| | నీవు చేసెదవు గాక | మీరిద్దరు చేసెదరుగాక | మీరు చేసెదరుగాక |
| ఉ.పు. | करवै<br>కరవై | करवावहै<br>కరవావహై | करवामहै<br>కరవామహై |
| | నేను చేసెదనుగాక | మేమిద్దరము చేసెదముగాక | మేము చేసెదముగాక |

# సంస్కృత ధాతువులు

| క్ర. సం. | వికరణము, | పదియును | ధాతువు | అర్థము | వర్తమానకాల ప్రథమపురుష-ఏకవచనము |
|---|---|---|---|---|---|
| 1. | I. | ప. | अट्<br>అట్ | తిరుగు | अटति<br>అటతి |
| 2. | II. | ప. | अद्<br>అద్ | భుజించు | अत्ति<br>అత్తి |
| 3. | I. | ప. | अर्च्<br>అర్చ్ | పూజించు | अर्चति<br>అర్చతి |
| 4. | X. | ఆ. | अर्थ्<br>అర్థ్ | యాచించు | अर्थयते<br>అర్థయతే |
| 5. | I. | ప. | अर्ह्<br>అర్హ్ | తగియుండు | अर्हति<br>అర్హతి |
| 6. | I. | ప. | अव<br>అవ | రక్షించు | अवति<br>అవతి |
| 7. | V. | ప. | आप्<br>ఆప్ | పొందు | आप्नोति<br>ఆప్నోతి |
| 8. | II. | ఆ. | आस्<br>ఆస్ | కూర్చొను | आस्ते<br>ఆస్తే |
| 9. | II. | ప. | इ<br>ఇ | వెళ్ళు | एति<br>ఏతి |
| 10. | IV. | ప. | इष्<br>ఇష్ (ఇచ్ఛ్) | కోరు | इच्छति<br>ఇచ్ఛతి |
| 11. | I. | ఆ. | ईक्ष्<br>ఈక్ష్ | చూడు | ईक्षते<br>ఈక్షతే |
| 12. | VI. | ప. | उज्झ्<br>ఉజ్ఝ్ | వదలు | उज्झति<br>ఉజ్ఝతి |
| 13. | I. | ఆ. | ऊह्<br>ఊహ్ | ఊహించు | ऊहते<br>ఊహతే |
| 14. | I. | ఆ. | एध्<br>ఏధ్ | వర్ధిల్లు | एधते<br>ఏధతే |
| 15. | X. | ఉ. | कथ्<br>కథ్ | చెప్పు | कथयति-ते<br>కథయతి-తే |
| 16. | I. | ఆ. | कम्प्<br>కంప్ | కదలు | कम्पते<br>కంపతే |
| 17. | I. | ప. | कांक्ष्<br>కాంక్ష్ | ఇచ్ఛించు | कांक्षति<br>కాంక్షతి |
| 18. | I. | ఆ. | काश्<br>కాశ్ | వెలుగు | काशते<br>కాశతే |
| 19. | IV. | ప. | कुप्<br>కుప్ | కోపించు | कुप्यति<br>కుప్యతి |
| 20. | IV. | ప. | कृत् (कृन्त्)<br>కృత్ (కృంత్) | నఱుకు | कृन्तति<br>కృంతతి |

ఆంగ్ల సంఖ్య వికరణ సంఖ్యను తెలుపును.

ప. పరస్మైపది, ఆ. ఆత్మనేపది, ఉ. ఉభయపది

| | | | | | |
|---|---|---|---|---|---|
| 21. | I. | ఉ. | कृ (कर्) | | करोति-कुरुते |
| | | | కృ (కర్) | చేయు | కరోతి-కురుతే |
| 22. | I. | ప. | क्रीड् | | क्रीडति |
| | | | క్రీడ్ | ఆడు | క్రీడతి |
| 23. | IV. | ప. | क्षिप् | | क्षिपति |
| | | | క్షిప్ | పడవేయు | క్షిపతి |
| 24. | X. | ఉ. | खण्ड् | | खण्डयति-ते |
| | | | ఖండ్ | నఱుకు | ఖండయతి/తే |
| 25. | I. | ఉ. | खन् | | खनति-ते |
| | | | ఖన్ | త్రవ్వు | ఖనతి/తే |
| 26. | I. | ప. | खाद् | | खादति |
| | | | ఖాద్ | భుజించు | ఖాదతి |
| 27. | X. | ఉ. | गण् | | गणयति-ते |
| | | | గణ్ | లెక్కపెట్టు | గణయతి/తే |
| 28. | I. | ప. | गम् (गच्छ्) | | गच्छति |
| | | | గం (గచ్ఛ్) | వెళ్ళు | గచ్ఛతి |
| 29. | I. | ప. | गै (गाय्) | | गायति |
| | | | గై (గాయ్) | పాడు | గాయతి |
| 30. | I. | ప. | घ्रा (जिघ्र्) | | जिघ्रति |
| | | | ఘ్రా (జిఘ్ర్) | వాసనచూచు | జిఘ్రతి |



| | | | | | |
|---|---|---|---|---|---|
| 31. | I. | ప. | चर् | | चरति |
| | | | చర్ | కదలు | చరతి |
| 32. | X. | ఉ. | चिन्त् | | चिन्तयति-ते |
| | | | చింత్ | ఆలోచించు | చింతయతి/తే |
| 33. | I. | ప. | जप् | | जपति |
| | | | జప్ | జపించు | జపతి |
| 34. | I. | ప. | जीव् | | जीवति |
| | | | జీవ్ | బ్రతుకు | జీవతి |
| 35. | I. | ప. | ज्वल् | | ज्वलति |
| | | | జ్వల్ | మండు | జ్వలతి |
| 36. | X. | ఉ. | तड् (ताड्) | | ताडयति-ते |
| | | | తడ్ (తాడ్) | కొట్టు | తాడయతి/తే |
| 37. | X. | ఆ. | तर्ज् | | तर्जयते |
| | | | తర్జ్ | బెదరించు | తర్జయతే |
| 38. | IV. | ప. | तुष् | | तुष्यति |
| | | | తుష్ | ఆనందించు | తుష్యతి |
| 39. | I. | ప. | तॄ (तर्) | | तरति |
| | | | తౄ (తర్) | దాటు | తరతి |
| 40. | I. | ప. | त्यज् | | त्यजति |
| | | | త్యజ్ | వదలిపెట్టు | త్యజతి |

